30.6.1995 శుక్రవారం 12 పేజీలు సంపుటి:67 సంచిక:25 విడిప్రతి రూ. 2.00 లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



## తెలుగు ప్రభుత్వానికి లంచాల తెగులు

తెలుగు దేశం పీకల్లోతు అవినీతిలో కూరుక పోతోంది. ఆస్థానంలోని అధి నాయకురాలి దగ్గర నుంచి ప్రభుత్వ కార్యాలయాల్లోని సామాన్య గుమాస్తా వరకు అవినీతి అంచలంచెలుగా వికృత రూపం దాలుస్తోంది. అవినీతిని అంత మొందిస్తానని భీష్మ ప్రతిజ్ఞలు చేసిన తెలుగు వల్లభుడు ప్రస్తుతం నీతి - అవినీతికి మధ్య గల గీతను చెరిపేసి తమాషా చూస్తున్నాడు. కాంగ్రెస్ రావాలంటే చేతులు తడపాల్సిందే. గతంలో, పనులు చేయించి పెట్టడానికి మధ్య దళారీలు వుండేవారు. ఆ బాధ

**ఎన్టీఆర్ పాలన ఇంత ఘోరమా?**

ఇప్పుడు తప్పింది. పెద్ద పెద్ద పనులకు పెద్దన్నయ్య దగ్గరకు వెళ్లే వారంతా నేరుగా వదినమ్మ గారి దర్శనం పార్టీలో వుండి కాంట్రాక్టులు చేసుకున్న ఇద్దరు కాంట్రాక్టర్లను తెలుగు దేశం పార్టీలో చేర్పించి పసుపు ముద్ర వేసి వారికి చేతి నిండా పనులు ఇప్పిస్తున్నందుకు వదిన గారికి ముట్టింది... ముట్టి తున్నది అంచనా వేయడం కష్టమే. హిందూపూర్‌లో ఒక కాంట్రాక్టర్ లక్ష్మీపార్వతి ప్రసన్నం కోసం లక్షా ఎనభై వేల రూపాయల ఖరీదు చేసే రవ్వల దుద్దులు బహూకరించారు.




# ఎవరికి దొరికింది వారు దోచుకుంటున్నారు!

ప్రభుత్వాల్లో రాజకీయ అవినీతి కేంద్రీకృతమై వుండేది. తెలుగు దేశం ప్రభుత్వంలో వికేంద్రీ కరించబడి మహమ్మారిలా అన్ని చోట్లా వ్యాపించింది. ముఖ్యంగా రాజకీయ వాదులు అందినంత వరకు జవురుకొని జాగ్రత్త పడ్తున్నారు. ఎన్టీఆర్ ప్రభుత్వంలో తమ పదవులు నీటి బుడగలన్న అభిప్రాయం బలపడటంతో దీపం వుండగానే ఇల్లు చక్క బెట్టుకునే ప్రయత్నంలో ఎమ్మెల్యేలు, మంత్రులు ఊపిరి సలపకుండా వున్నారు. కాంగ్రెస్ ప్రభుత్వాల్లో కంటే ఇప్పుడు "పనులు" చేయించు కోవటం చాలా తేలికై పోయింది. కాకపోతే "సంభావన" బాగా ముట్ట జెప్పాలి. ప్రతి పనికి ఒక రేటు ఫిక్స్ అయిపోయింది. పచ్చ నోట్ల వాసన చూపనిదే ఫైళ్లు కదలటం లేదు. మంత్రి గారి మామూలు, పిఎస్, పిఏల చిలక కొట్టుళ్లు తడిసి మోపెడవుతున్నా పని అవసరాన్ని బట్టి మూల్యం ఎంతైనా చెల్లించుకోక తప్పడం లేదు.

అమ్మగారి కొక రేటు - అయ్య గారి కొక రేటు, బాబు గారికొక ధర అయితే డాక్టర్ సాబ్‌కు పూర్తి ధర. మంత్రి గారి పేషీకెళితే ఒక్కొక మామూళ్లు [illegible]

చేసుకుంటే చాలు. సాయంత్రానికల్లా సంబంధిత ఆర్డర్లు చేతిలో వుంటాయి. వదినమ్మ దర్శనం సామాన్యులకు సాధ్యం కాదు కాబట్టి ఆ పని మంత్రులు, ఎమ్మెల్యేలు చేస్తున్నారు. వస్తు రూపేణో, నగా నట్రా రూపేణో ముట్ట జెప్పాల్సింది ముట్ట జెప్పి పార్వతీ ప్రసన్నం చేసుకుంటున్నారు. అధికారుల

**అమ్మ గారిదొక రేటు, అయ్యగారిదొక రేటు; బాబు మామూలు వేరు, డాక్టర్ స్టైయిల్ వేరు; మంత్రులు, ఎమ్మెల్యేలది చిలకకొట్టుడు!**

బదిలీలు, ప్రమోషన్లు మాత్రమే కాకుండా కార్పొరేషన్ ఛైర్మన్లు, డైరెక్టర్లు, ఇతరత్రా పదవుల క్కూడా "లక్ష్మీ" పార్వతీ ప్రసన్నం తప్పడం లేదు. వసూళ్లలో కూడా ఎవరి స్టైల్ వాళ్లదే... లక్ష్మీపార్వతి చేతితో ఒక్క పైసా కూడా ముట్టదట. అయితే ఆమె తాలూకు చెల్లించాల్సిన అమ్యామ్యా అంతా ఆమె కోరుకున్న చోటుకు జమ అవుతుంది. భవిష్యత్తులో ఏం అవసరం వచ్చినా తట్టుకొని నిలబడ టానికి ఆమె జాగ్రత్తలో ఆమె వుంది. ముఖ్యమంత్రి నియోజక వర్గంలో గతంలో కాంగ్రెస్

దాంతో ఆ కాంట్రాక్టు పేరుకు పసుపు రంగు తగిలించి నియోజక వర్గంలోని పనులన్నీ అతగాడికే ముట్ట జెప్తున్నారు. ప్రతి పనీ అతనికి వచ్చేలా 30 శాతం లెస్ వేసి కాంట్రాక్టులు అప్ప జెప్తున్నారు. ఆ తర్వాత రివైజ్డ్ ఎస్టిమేషన్లు వేసి పది లక్షల కాంట్రాక్టుకు కోటి నలభై లక్షల రూపాయలు దోచి పెట్టారు. ఆ కాంట్రాక్టరు నాలుగైదు సార్లు రివైజ్డ్ అంచనాలు వేయనిదే పని పూర్తికాదు. సొమ్ము ప్రభుత్వానిది, సోకు కాంట్రాక్టరుది... అమ్యామ్యా లక్ష్మీపార్వతిది... ఇదీ తంతు.

ఇక క్యాబినెట్‌లో నెంబర్ టూగా చెలామణి అవుతున్న బాబు కూడా ఇల్లు చక్క బెట్టుకునే కార్యక్రమంలో వున్నాడట. ఆయన స్టైల్ వేరు. పని కావాల్సిన వాళ్లు ఆయన పేషీలో అనమ్మదీయ ఓఎస్‌డి ప్రత్యేక అధికారిని కలిసి ముందుగా మాట్లాడు కోవాలి. రేటు ఫిక్స్ అయ్యాక బాబు గారి సొంత మనిషి

సంపాదించు కుంటుంటే మనం మాత్రం మడి గట్టుకోవడం ఎందుకన్నది ఆయన అంతరాత్మ ప్రబోధం కావచ్చు. ఏదైతేనేం డాక్టర్ సాబ్ గారి ఛానల్ కూడా నెట్‌వర్క్‌లో నిమగ్నమై వుంది. ఇక అన్న గారి కొడుకులు, బంధువర్గం మొహమాట పైరవీలు సరేసరి. పెద బాబు చెప్పాడనో, హరిబాబు ఇచ్చాడనో, బాలయ్య బాబు ఇంట్రస్ట్ అనో పనులు జరుగుతూనే వున్నాయి.

కొందరు కొత్త మంత్రులు, పాత మంత్రులు తమ పిఏలుగా, పిఎస్‌లుగా పదేళ్ల క్రితం రిటైర్డ్ అయిన కాకలు తీరిన వారిని నియమించుకొని తమ పని సులువు చేసుకున్నారు. ప్రొఫెషనల్స్‌గా ముద్ర పడిన ఈ మాజీలు నాజీల కంటే నిరంకుశంగా ముక్కు పిండి మరీ వసూలు చేస్తున్నారు. మంత్రి గారి భాగం, సొంత ఖర్చులు అన్నీ అణా పైసాల్తో వసూలు కావల్సిందే.

ఇక ఎమ్మెల్యేల, వారి దోవ వారిది. ముక్కూ మోహం తెలీకుండా, రాజకీయ ఆరంగేట్రం చేయకుండానే నేరుగా ఎమ్మెల్యేలైన వారి సంఖ్య దేశంలో షుమారు వంద దాకానే వుంది. ఎమ్మెల్యే అంటే సంపాదించే వాడన్న అర్థం మినహా వారికి మరో అర్థం తెలీనట్లుంది. దీనికి తోడు స్థానిక

గ్రహించారు. కార్యాలయాల్లో ఉన్న తాధికారుల ఛాంబర్‌లలో తిష్ట వేసి మరీ పని చేయించుకు పోతున్నారు. వెన్నెముక లేని అధికార గణం ఎమ్మెల్యేలకు పెద్ద ఫైర్ వేసి మరీ పనులు చేసి పెడ్తున్నారు.

### అవినీతికి అసలు కారణం?

రాజకీయంగా అవినీతి

**వదినగారి దర్శనం చేసుకున్నా, బాబుగారి ఏజంటునుకలుసుకున్నా సాయంత్రానికి ఫైళ్లు రెడీ!**

విశృంఖలతకు రాజకీయ అస్థిరతే ప్రధాన కారణంగా కన్పిస్తోంది. తెలుగు దేశంలో 225 మంది దాకా ఎమ్మెల్యేలున్నా అధినాయకుడి ధోరణి కారణంగా ఎవరూ భద్రత ఫీల్ కావటం లేదు. ఇటీవల ఎన్టీఆర్ కుటుంబంలో పెచ్చు పెరిగిన కుటుంబ కలహాలు దీనికి తోడు కావటంతో ఎవరు ఎన్ని రోజులు అధికారంలో వుంటారు? ఎన్టీఆర్ తర్వాత రాజకీయం ఎలావుంటుంది? అసలు పార్టీ




## అధికారంవుండదన్నభయమేఅవినీతికి కారణం!

స్వయంగా సదరు పని దా'స ఇంటికి వెళ్లి సొమ్ము రాబట్టు కుంటాడు. తెల్లారే అతడిచ్చే గ్రీన్ సిగ్నల్ మీద ఫైలుకు కాళ్లొచ్చి చకచకా మంత్రి గారి టేబులెక్కడం, ఆయన గారి సంతకం అవటం క్షణాల మీద ఉత్తర్వులు జారీ కావడం రొటీన్ వ్యవహారం. రోజుకు కనీసం ఇంతైనా వసూలు చేసి జమ చేయాలన్నది లక్ష్యం.

ఇలా వుండగా గతంలో మిస్టర్ క్లీన్‌గా పేరు సంపాదించిన గద్దం డాక్టర్ గారు ఇప్పుడు అర్థంగా వున్న గద్దం పీకించి జాగ్రత్త పడ్తున్నారట. అందరూ

ఎమ్మెల్యే సిఫార్సు లేకుండా సంబంధిత నియోజక వర్గంలో పనులు చేయరాదని ఇటీవలనే ముఖ్యమంత్రి అనధి కారికంగా తాకీదు ఇచ్చాడు. ఇంకేముంది-పైరవీకి పెద్దరు కోదయ్యేసరికి సచివాలయం కిటకిట లాడుతోంది. సీనియర్ ఎమ్మెల్యేలు ఎలాగూ పనులు చేయించు కోవటంలో ఆరి తేరారు కాబట్టి వారి ధోరణి వేరుగా వుంది. వారు మంత్రులను ఆశ్రయించే కంటే సంబంధిత అధికారి నెత్తిన కూర్చొని పనులు చేయించు కోవటం సులువన్న చిదంబర రహస్యాన్ని

ఉంటుందా? ఊడుతుందా? ఎన్టీఆర్ తన రాజకీయ వారసురాలిగా లక్ష్మీపార్వతిని ప్రకటిస్తే పరిస్థితి ఎలా వుంటుంది? అల్లుళ్లు, కొడుకులు ఊరు కుంటారా? తిరగ బడతారా? ఒకవేళ తిరుగు బాటంటూ చేస్తే ఎవరి వైపు మొగ్గాలి? అప్పుడు ఎన్ని గ్రూపు లేర్పడతాయి? ఏమో? ఇవన్నీ ఆలోచిస్తూ టైమ్ వేస్ట్ చేసుకునే కంటే దీపముండగానే ఇల్లు చక్క దిద్దుకోవటం మని అందరు 'అత్త' పడటం అవినీతి పెచ్చు పెరగటానికి ప్రధాన కారణంగా కనిపిస్తోంది.



యువమిత్రులు

# శ్రీ ఆనం వివేకానంద రెడ్డిగారికి,

మున్సిపల్ ఛేర్మన్ పదవిని వంద రోజులు దిగ్విజయంగా పూర్తి చేసిన శుభసందర్భంలో వారికి సింహపురి సి.సి.ఎస్. మిత్రమండలి అభినందనలు తెలియజేస్తున్నది.

మీ సారథ్యం క్రింద నెల్లూరు పురపాలక సంఘ సమావేశాలు సమర్థవంతంగా సామరస్య పూరిత వాతావరణంలో జరుగుతుండడం పౌరులకు ఎంతో సంతృప్తికరంగా వుంది. భవిష్యత్తులో కూడా ఈ సుహృద్భావ వాతావరణాన్ని కొనసాగించాలని తన మన భేదము లేకుండా అందరినీ కలుపుకొని కూడా మునిసిపల్ పాలన గావించాలని ఆకాంక్షిస్తున్నాము. ఇందుకు సహకరిస్తున్న పట్టణ పౌరులకు పెద్దలకు, వైస్ ఛేర్మెన్ కౌన్సిల్ ప్యానల్ ఛేర్మన్లకు, కౌన్సిలర్లకు, ముఖ్యంగా పి.వి. ప్రసన్నకుమార్ రెడ్డి గారికి **మా హృదయ పూర్వక కృతజ్ఞతలు**

**సి.సి. సుబ్బరాయులు, ఎం.ఏ**

పి.సి. రెడ్డి, జి.వి. రమణయ్య, ఎం.ఎల్. నరశింహం, కె.ఎ.ఎస్. గుప్త, వొమ్మిన సుబ్రహ్మణ్యం, ఇ.వి.ఎస్. నాయుడు, యన్. వెంకటేశ్వరరెడ్డి, కె. రఘునాథరెడ్డి, పెళ్ళకూరు చంద్రశేఖర రెడ్డి, కె. హరిగోపాల్, డా.డి.సత్యనారాయణ, తాళ్ళూరు రంగనాధం, సి.సి. రత్నం, సి. సుబ్బారావు, వై.వి. శేషయ్య, వి. రామకృష్ణయ్య, జానా రమణయ్య, ఇమ్మడి వెంకట సుబ్బయ్య, యన్.పి. బసవయ్య, యం. మహీధర్, యస్.కె. జిలాని, యన్. సుందర రామిరెడ్డి, ఎ.ఎస్.టి. బాలాజి, చేజర్ల సుధాకర్, సింగంశెట్టి రాధకృష్ణమూర్తి, యస్.పి. అహమ్మద్, ఇమ్మడి ప్రకాశరావు, డి. ప్రకాశరావు, యస్. పెంచలయ్య, రాతిక్రింద వెంకటేశ్వర్లు, రాతిక్రింద సుబ్బారావు, కె. రాజు, కె. పార్థసారథి, ముల్లంగి కేశవరావు, చిన్ని వెంకటసుబ్బయ్య, కె. సత్యరామయ్య, చతుర్వేదుల శ్రీనివాసులు, ముల్లంగి రాంబాబు, పచ్చిపులుసు వెంకటేశ్వర్లు, కుదుముల మీరయ్య వందలాది శ్రేయోభిలాషులు, మిత్రులు.

**BEST COMPLIMENTS FROM**

**AMARAJEEVI PINAKINI SUPER MARKET**

**NELLORE**

# సిగ్గుచేటు!

రాష్ట్రంలో మద్యం తయారు చేసే డిస్టిలరీలు, బ్రూవరీలకు లైసెన్సులు పునరుద్ధరించడం ద్వారా తెలుగు దేశం ప్రభుత్వం మద్య నిషేధ ఉద్యమ ఆశయానికి తూట్లు: గండి కొట్టింది; ఆ ఉత్తర్వు ఆచరణకు రాక మునుపే ఎన్టీఆర్ వయంతో రద్దు చేసుకొని నవ్వుల పాల్పోయి, అపహాస్యం పాలైంది రెండూ సిగ్గు చేటు సంగతులే: రెండూ ప్రభుత్వ బలహీన తలను ఎత్తిచూపే అపసవ్యపు నిర్ణయాలే!

మద్య నిషేధం విధించిన రోజే, రాష్ట్రంలో విస్కీ, బ్రాందీ, బీరు తదితరాలు ఉత్పత్తి చేసే డిస్టిలరీలు, బ్రూవరీలను మూసి వేయించింది ప్రభుత్వం. అయితే తమ ఉత్పత్తులు రాష్ట్రం లోపలే కాక, బయట కూడా అమ్ముక పోతుంటాయి కాబట్టి, తమ ఫ్యాక్టరీలను మూసి వేయడం చట్ట విరుద్ధ మంటూ వారు హై కోర్టును ఆశ్రయించారు. రాష్ట్ర ప్రభుత్వం రూపొందించిన మద్య నిషేధ చట్టంలో మద్య విక్రయం, వినియోగం తప్ప మద్య ఉత్పత్తిని నిషేధించ లేదు కాబట్టి, ఫ్యాక్టరీలు మద్యాన్ని తయారు చేసి ఇతర రాష్ట్రాలలో అమ్ము కోవడాన్ని అనుమతించాలని హై కోర్టు ఆదేశించింది. దీని పై సుప్రీం కోర్టుకు అప్పీలు చేయాలని నిర్ణయించినట్లు ఎక్సైజ్ మంత్రి ప్రకటించారు. ఈలోగా ఏమి జరిగిందో కాని, ముఖ్య మంత్రి ఎన్‌టి రామారావు గారు బ్రిటన్ పర్యటనకు వెళ్లే ముందు అప్పీలు మాట మర్చిపోయి, ఫ్యాక్టరీలు నడుపు కోవడానికి అనుమతించే ఫైలు పై సంతకం చేసేశారు.

ఒక కోణం నుంచి చూస్తే ఇది సక్రమ నిర్ణయమే. మద్య నిషేధం అమలులో వుంటేది మన రాష్ట్రంలో మాత్రమే. ఇరుగు పొరుగు రాష్ట్రాలలో లేదు. వారికి మద్యం అవసరం. ఫ్యాక్టరీలు ఖాళీగా పెట్టే కంటే వాటిలో మద్యం ఉత్పత్తి చేసి ఇతర రాష్ట్రాలకు పంపవచ్చు. దానివల్ల ఫ్యాక్టరీలలో పనిచేసే వారికి ఉద్యోగాలు నిలుస్తాయి; ప్రభుత్వానికి వంద కోట్లకు పైగా పన్ను రూపేణా ఆదాయం లభిస్తుంది. ఎక్సైజ్ శాఖను నిర్వహించడానికి ఇప్పుడు ఏడాదికి 50 కోట్లకు పైగా వ్యయమౌతున్నదని అంచనా. ఏటా వెయ్యి కోట్లకు పైగా ఆదాయం తెచ్చి పెట్టే కామధేనువు వంటి శాఖ కాస్త, 50 కోట్లు తినే పట్టిపోయిన ఆవు వలె తయారైంది. మద్య నిషేధ స్ఫూర్తికి భంగం వాటిల్ల కుండా, వంద కోట్ల ఆదాయం వచ్చేటప్పుడు దాన్ని వదులు కోవడం అనవసరం. ఈ దృష్టితో చూసినప్పుడు ఎన్టీఆర్ తీసుకున్నది సమంజసమైన నిర్ణయమే.

అయితే ఈ నిర్ణయం తీసు కోవడానికి శ్రీమతి లక్ష్మీపార్వతి పది కోట్ల వరకు డిస్టిలరీల నుంచి ముడుపు స్వీకరించాన్న ఆరోపణ వినవస్తున్నది. ప్రభుత్వానికి ఆదాయం సమకూర్చే సంకల్పంతో కాక, వ్యక్తిగత లాభం కోసం ఫైలు నడిపించారన్న విమర్శ వినవస్తూంది. ఇది గర్హనీయమైన విషయం. ఇంకొక ప్రక్క ప్రతి పక్షాలు, పత్రికలు కూడా ప్రభుత్వ నిర్ణయాన్ని నిరసించాయి. ఇతర రాష్ట్రాలకని బయల్దేరిన లారీలు మధ్యలోనే సరకు దించేసి, రాష్ట్రంలో బ్రాందీ, విస్కీల వరద పారిస్తాయని గగ్గోలెత్తింది. ఆ విమర్శను తట్టుకోలేని ఎన్టీఆర్ లండన్ నుంచే తన ఉత్తర్వును తానే రద్దు చేస్తూ ఫ్యాక్స్ సందేశం పంపారు.

ప్రజా సంక్షేమం దెబ్బ తినకుండా, ప్రభుత్వ ఆదాయం పెంచే నిర్ణయం తీసు కొన్నప్పుడు, తమది సత్సంకల్పమే అయినప్పుడు ముఖ్యమంత్రి తన నిర్ణయాన్ని గట్టిగా సమర్థించు కొని వుండాలి. ప్రజలకు నచ్చ చెప్పి వుండాలి. తన నిర్ణయంలో ఆ స్వచ్ఛత లేదు కాబట్టే ఆయన విమర్శ రాగానే జావగారి పోయారు. సిగ్గు చేటైన రీతిలో, దొంగ తనం చేస్తూ దొరికి పోయిన వాడి వలె ప్రవర్తించారు. కృష్ణా పట్నం థర్మల్ కేంద్రం విషయంలోనూ ఆయన ప్రవర్తన ఇదే రీతిలో వుండింది. ఇవన్నీ ప్రభుత్వ బలహీనతలు, పాలకుల మనో దౌర్బల్యాన్ని ప్రతిఫలింప జేసే దృష్టాంతాలు.

జమీన్‌రైతు

ఎన్టీఆర్ అపసవ్యపు నిర్ణయాల వల్ల ప్రభుత్వం తరచు నవ్వుల పాలౌతున్నది. పరిపాలించే వారికి నిగ్రహం, నిలకడ, నిర్ణయ సామర్థ్యం, మాటకు కట్టుబాటు, స్థిరత్వం అవసరం. ఎటు గాలి వీస్తే అటు తలవంచే తత్వం వుంటే ఆ పరిపాలన సైతం అంతే చపల చిత్తంగా వుంటుంది.

డిస్టిలరీలు విషయంలో, తాజాగా ఎన్టీఆర్ తీసుకొన్న రద్దు నిర్ణయమూ విమర్శలకు తావిస్తున్నది. మద్యం ఉత్పత్తిని రద్దు చేస్తూ చట్టంలో సవరణ తేకుండా, కేవలం డిస్టిలరీల లైసెన్సు రద్దు చేస్తే, రేపు సుప్రీం కోర్టు కూడా వారికి అనుకూలం చేస్తుంది. అందువల్లే ఒక పథకం ప్రకారం ఎన్టీ రామారావు గారు ఈ చపల చిత్త నిర్ణయాలు చేస్తున్నారని, ఈ గందర గోళాన్ని సుప్రీం కోర్టు అభిశంసించి, డిస్టిలరీలకు అనుకూలంగా తీర్పు చెప్పే పరిస్థితి కల్పిస్తున్నారని ప్రతి పక్షాలు నిందిస్తున్నాయి. ముఖ్యమంత్రి ఇప్పటికైనా ఒక స్థిర నిశ్చయానికి వచ్చి, చట్ట సవరణ ద్వారా మద్యం ఉత్పత్తిని నిలిపి వేస్తే తప్ప ఆయన తన స్వచ్ఛతను నిరూపించు కోలేరు. ఈ దాగుడు మూతల పర్వాన్ని మళ్లీ కొనసాగిస్తే, మద్య నిషేధం పట్ల ఆయనకు చిత్తశుద్ధి లేదని, డిస్టిలరీల నుంచి ముడుపులు స్వీకరించిన వారి ఒత్తిడులకు లొంగి ప్రవర్తిస్తున్నారని అర్థం చేసు కోవలసి వుంటుంది.

---

జమీన్‌రైతు

29.6.1945

వెల: 0-1-6 పేజీలు:8

### లోకాభిరామాయణం

నేటి ఆంధ్ర కాంగ్రెస్ దేశభక్తులలో ఎవ్వరి హృదయాన్ని చీల్చి పరీక్షించినా, ఆ అడుగున, ఎప్పుడో ఒకప్పుడు, ఏదో విధాన వానికి వీరావేశం కల్గించింది ఏదో ఒక "కృష్ణాపత్రిక" సంపాదకీయం వుండి తీరుతుంది.

-న్యాయపతి

కృష్ణాపత్రిక సంపాదకులు శ్రీ ముట్నూరి కృష్ణారావు పంతులు గారు కొంత కాలముగ జలోదరము వల్ల బాధపడుతూ 23వ తేదీ సాయంత్రం 5 గంటలకు మద్రాసులో తమ వియ్యంకులు డి.బి. దొడ్ల రాఘవయ్య గారి యింటి కాలము చేశారు వారి వయస్సు 68 సం.లు. వీరి భార్య, కుమార్తె, కోడలు బంధు మిత్రాదులు దుఃఖంలో వున్నారు.

### జిల్లాకాంగ్రెస్‌రాద్ధాంతం

30తేది కాంగ్రెస్ వాదుల సమావేశం జరుగునని రాఘవయ్య గారు ప్రకటించడం వల్ల జిల్లా కాంగ్రెస్ అసెంబ్లీ అనేది లేదా అని కొందరు అనుమానిస్తున్నారు. ఇలాంటి అకారణ అనుమానాలకు అవకాశమిచ్చే 30తేది సమావేశం రాఘవయ్య గారు వాయిదా వెయాలని, త్వరలోనే జిల్లా కాంగ్రెస్ అసెంబ్లీ సమావేశ పరుస బడునని జిల్లా అధ్యక్షులు శ్రీ వంగల్లు కోదండ రామిరెడ్డి గారు ప్రకటిస్తున్నారు.

### శ్రీ కస్తూరిదేవి బాలికా హైస్కూలు

హాస్టలు జూలై 1నుండి ప్రారంభింతురు. హాస్టలు పరిపాలనకు, బాలికల తల్లిదండ్రుల నుండి కొందరిని విద్యాలయ కమిటీ నుండి కొందరిని ప్రత్యేక ఉపసంఘముగా నియమించ బోతారట.

### నెల్లూరుముచ్చట్లు

చక్కెర కరువు హెచ్చుగా వుంది. హోల్‌సేల్ డీలర్ని మార్చుమంటారు కొందరు. అది చాలా డేంజరు. వర్తకుల చేతుల్లోనే బెట్టారా బ్లాకు మార్కెట్టు పెరిగి పోతుంది. రెడ్డిని మార్చడం యిష్టం లేదు గాని, కారణాన్ని సరిజేస్తే చాలు, ఇంకా కో ఆపరేటివ్ స్టోర్సుకు యివ్వడం బాగుంటుంది.

* * *

బజారులోను, ట్రంకురోడ్డు మీదను, ప్రక్కన వేసిన కాలిదారిన (Foot Path) నడువ కుండా రోడ్డు మీద నడిచి నందుకు విపరీతంగా కేసులు పెట్టి జుల్మానాలు విధిస్తున్నారు. పబ్లిక్ దీన్ని గమనించుగాక.

50 ఏళ్ళ క్రితం ఈ వారం

* * *

పోలీసుకొక సలహా: ఆ కాలిదారిలో సైకిళ్లు, చిన్న అంగళ్లు యిన్నీ బెట్టి దారిని నిరోధిస్తున్నారు. అడ్డంకులు లేకుండా చేయవలసినది గాను, శిక్షించిన వారి జాబితాను ప్రతివారం ప్రకటించ వలసినది గాను, అనవసరంగా బాధించ కుండాను చూడమని పోలీసుకు మా విన్నపము.

* * *

అబ్బా!! వి.ఆర్. హై స్కూలులో ఇన్నాళ్లకు కెమిస్ట్రి సెక్షన్ ప్రవేశ పెడుతున్నారట.

-విమర్శకుడు

కొరవ 10 పేజీలో

---

# నెల్లూరు డాక్టర్లను నిందించడం న్యాయంకాదు!

నెల్లూరు డాక్టర్ల పై శ్రీ వాస్తు రామచంద్ర జమీన్‌రైతు జనవాణి శీర్షికలో చేసిన వాఖ్యలు దారుణంగా వున్నాయి. ప్రస్తుతం నెల్లూరు వైద్య రంగంలో మరో మద్రాసుగా పేరు తెచ్చు కొంటున్నది. నిపుణులైన డాక్టర్ల సంఖ్య నానాటికీ పెరుగుతున్నది. వారి మధ్య సుహృద్భావ పోటీ వల్ల వైద్యం ఖరీదు సామాన్యులకు అందుబాటులో వుంది. మెడికల్ బిల్లు భారీగా వుంటున్నదంటే దానికి కారణం ఆకాశానికి పెరిగి పోయిన మందుల ధరలే కాని కేవలం డాక్టర్ల ఫీజులు మాత్రం కాదు. మద్రాసులోని స్టార్ హాస్పిటల్స్‌తో పోలిస్తే నెల్లూరులో వైద్యం కారు చౌక అని చెప్పాలి. ఇలాంటి పరిస్థితుల్లో నెల్లూరు డాక్టర్లు జలగలని, పేషంట్ల రక్తం పీల్చి వారు కుబేరులై పోతున్నారని వాస్తు రామచంద్ర గారు నిందించడం అన్యాయం. రామచంద్ర గారు కూడా వాస్తు వైద్యంలో ఘనాపాటి. ఆయన చేసిన వ్యాఖ్యలు సామాన్య పౌరులకె మనసు నొప్పించేవిగా వుంటే ఇక నిజాయితీ పరులైన డాక్టర్లను ఎంత కృంగ దీస్తాయో చెప్పక్కర్లేదు.

నెల్లూరు -తిరుమూరు సుధాకరరెడ్డి

### రైల్వే శాఖకు విజ్ఞప్తి!

నెల్లూరు టౌన్ ఇటీవల ఎలు వ్యాపారాలకు కూడలి అయ్యింది. కాని రవాణా సౌకర్యాలలో భాగమైన రైల్వే సౌకర్యం మాత్రం అంతంత మాత్రంగానే వుంది. తన చేతిలో వున్న అధికారాలతో విజయవాడ రైల్వే డివిజనల్ మేనేజర్ ఈ క్రింది సౌకర్యాలు కల్పించమని మనవి. ఉదయం పూట కృష్ణా ఎక్స్‌ప్రెస్ [illegible] వచ్చే వరకు ట్రైన్ లేదు. 10, 11 గంటల ప్రాంతంలో మద్రాస్ లేదా తిరుపతి నుంచి విజయ వాడ వరకు ఒక ట్రైన్‌ను పినాకినీ ఎక్స్‌ప్రెస్ మాదిరి నడపాలి. విజయ వాడ నుండి బిట్రగుంట వచ్చే 423 నెంబరు పాసింజర్ 4 గంటలు అనవసరంగా ఆ స్టేషన్‌లో నిలచి పోతున్నది. దానిని గూడూరు వరకు నడిపితే ప్రయోజన ముంటుంది.

### జనవాణి

మద్రాసు నుండి బొంబాయి వరకు గూడూరు, నెల్లూరు, తెనాలి, నడికుడి, సికింద్రాబాద్ మీదుగా నడిచే ఒక ఎక్స్‌ప్రెస్ వేయాలి. వస్త్ర, బంగారు, కొయ్యల వ్యాపారులు, ఉద్యోగులకు ఎంతో ప్రయోగ కారిగా వుంటుంది. స్టేషన్‌లో ఇప్పుడున్న విశ్రాంతి గదుల సంఖ్య రెండు నుంచి ఆరుకు పెంచాలి. నెల్లూరులో [illegible] రెస్టారెంట్ [illegible] ఉపయోగ దారులు ఈ విషయమై అవసరమైతే ఒక వుద్యమం చేపడితే బాగుంటుంది.

నెల్లూరు-ఆర్. వెంకటేశ్వర్లు

ఎన్.ఆర్.సి.సి. సభ్యుడు

### రెవిన్యూ శాఖ ప్రాముఖ్యత తగ్గిపోతుంది!

ప్రభుత్వ పాలనా వ్యవస్థలో రెవిన్యూ శాఖ మాతృ సంస్థగా పరి గణింపబడి ఎంతో ప్రతిష్టా కరంగాను, వైభవోపేతంగానే వుండేది. స్వాతంత్ర్యం లభించిన 10 సంవత్సరాల తరువాత కూడా రెవిన్యూ శాఖ ఎంతో పటిష్టంగా నడిచింది. కాని కాలక్రమేణా కాలాను గుణంగా పాలనా వ్యవస్థలో ఆవిర్భవించిన మార్పుల వల్ల రెవిన్యూ శాఖ బలహీన పడిపోయింది. మొట్ట మొదటగా న్యాయశాఖ రెవిన్యూ శాఖ నుండి చీలిపోయింది. తరువాత ఆర్థిక పరమైన సబ్ రిజిస్ట్రార్ శాఖ విడిపోయింది. కొత్తగా నీటి పారుదల, రహదార్లు, భవనాలు, పంచాయితీ రాజ్, అబ్కారీ, వాణిజ్య

కొరవ 10 పేజీలో

# చక్కెర మంత్రిగారు 'ఉత్తర' కుమారులౌతున్నారు!

తమ తండ్రి శ్రీనివాసులు రెడ్డి నుంచి మంత్రి నల్లపురెడ్డి ప్రసన్న కుమార రెడ్డికి ఉత్తరాలు వ్రాసే విద్య మా బాగా అబ్బింది. ముఖ్యమైనవి చర్చలతో మాట్లాడి పరిష్కరించాల్సినవి; అప్పటి కప్పుడు ఆర్డర్లు వేయించుకొని రావలసిన సమస్యల మీద కూడా వుత్తరాలు వ్రాసి పోస్టు చేయడం మంత్రి గారికి అలవాటు. అటువంటి ఉత్తరమే ఒకటి ఈ మధ్య ముఖ్య మంత్రికి మళ్లీ వ్రాసారాయన. పెన్నార్ డెల్టా క్రింద 34 మైనర్ డ్రైన్ల రిపేరు, 164 కోట్ల వ్యయం కాగల ప్రతిపాదనలు తయారు చేసి పంపుతున్నాను; ఇటీవల కురిసిన భారీ వర్షాల వల్ల దెబ్బ తిన్న మేజర్, మైనర్, మీడియం డ్రైన్ల మరమ్మత్తులకు 63.03 లక్షలు మంజూరు చేయమని అందులో ముఖ్యమంత్రిని కోరారు మంత్రి. డెల్టాలో 50 డ్రైన్ల రిపేర్లకు 25.70 లక్షల వ్యయం కాగల అంచనాలు తయారు చేసినట్లు, అవి టెండర్ల దశ వరకు వచ్చినా కాంట్రాక్టర్లు ఎక్కువ మొత్తంలో రేట్లు కోట్ చేయడంతో నిలిపి వేసినట్లు వివరించారు. అల్లూరు స్వాంపు, పైడేరు, మలిదేవి, నక్కల కాల్వలు వర్షాలకు బాగా దెబ్బ తిన్నాయని, వీటి రిపేర్లకు 36 లక్షలు కావాలని మంత్రి ఆ లేఖలోనే కోరారు. మంత్రి గారి కోరికలు బాగానే వున్నాయి. కేవలం "ఉత్తర" కుమారులుగా ప్రవర్తించడం కాక, అన్ననో, వదిననో వప్పించి నిధులు తెస్తే జిల్లా రైతులు సంతోషిస్తారు.

## నెల్లూరు సంగతులు

### వెనుకబడిన తరగతుల గర్జన!

స్థానిక సంస్థల ఎన్నికల్లో గెలుపొందిన వెనుక బడిన తరగతుల వారికి సన్మానం జిల్లా వెనుకబడిన తరగతుల సంఘం జిల్లా అధ్యక్షుడు ఎ. రాజసింహ 25 తేది టౌన్‌హాల్‌లో ఏర్పాటు చేశారు. 65 మందిని సన్మానిస్తున్నట్లు కరపత్రంలో ప్రకటించినా సన్మానితులు 20 మందికి మించి రాలేదు! ఆహ్వాన కమిటీలోని సభ్యులు కూడా గైర్హాజరయ్యారు. తరతరాలుగా శూద్రులుగా ముద్ర పడి తాము వెనుకబడ పోయామని; రిజర్వేషన్ల వల్ల నాయకులయ్యే అవకాశం దొరికిందని. అందరూ కలిసి కట్టుగా వ్యవహరించి సమస్యలు పరిష్కరించు కోవాలని రాజసింహ తన అధ్యక్షోప న్యాసంలో చెప్పారు. ఐక్యతకోసం రాజకీయాలతో సంబంధం లేకుండా పనిచేసే ఈ రాజకీయేతర సంఘంలో చేరాలని మహిళా విభాగం కన్వీనర్ శ్రీమతి పచ్చవ నాగమ్మ కోరారు. సభలో కోవూరు, నెల్లూరు రూరల్, వాకాడు మండ లాధ్యక్షులు, పి. సుబ్రహ్మణ్యం, పి. వెంకటేశ్వర్లు, పి. దశరథ రామయ్య నెల్లూరు, గూడూరు మునిసిపాలిటీలలో గెలిచిన కౌన్సిలర్లు, జడ్పీటిసి మెంబర్లను సన్మానించారు.

### నెల్లూరులో సుదర్శన యాగం

కర్నాటకలోని యాదవాద్రి (మెల్కోటె)లోని శ్రీయతిరాజ మఠాధిపతులు శ్రీయతి రాజ సంపత్కుమార రామానుజ జీయర్ స్వామి ఆధ్వర్యంలో

కొరవ 8 పేజీలో

## సణుగుడు

* కాన్వెంట్ స్కూళ్లలో చదువులు మధ్యతరగతితలకుమించినభారమౌతున్నాయి
* బ్రిటీషు పాలన భేషైనదట- అన్నగారికి మతి చలించిందా?

తమ పిల్లలకు ఇంగ్లీషు చదువులు 'కొని' ఇవ్వాలనే తపన మధ్య తరగతి కుటుంబీకుల కాపురాలను కష్టాల పాలు జేస్తున్నది. రాను రాను చదువులు అత్యంత ప్రియమైన సరుకులుగా మారి పోతున్నాయి.

ఇది వరకటి వలె ఉత్త బిఎనో, ఉత్తుత్తి బిఎస్‌సినో పాసైతే ఎందుకూ పనికి రావడం లేదు. సాధారణమైన డిగ్రీ పట్టాకు పదవ తరగతి ఫెయిలుకు ఉద్యోగావ కాశాలలో పెద్ద తేడా కన్పడడం లేదు. ఏదో ఒక వృత్తి విద్య చదివితే తప్ప జీవితంలో కుదురు కోవడం అసాధ్యం. మెడిసిన్ నుంచి ఐటిఐ డిప్లొమా వరకు కాలేజిలలో వున్న సీట్లు తక్కువ, అందుకు పోటీ పడే వారి సంఖ్య ఎక్కువ. పోటీ పెరిగే కొద్దీ, ప్రతిభకు గుర్తింపు హెచ్చుతూ వుంది. ఒకప్పుడు ఫస్ట్ క్లాస్‌లో పాసైతే ఆ వీధి వీధంతా గొప్పగా చెప్పుకునే వారు. ఇప్పుడు 80 శాతం మార్కులతో పదవ తరగతి లేదా ఇంటర్ పాసైతే కోరిన కోర్సులో సీటు రావడం లేదు. ఐఐటి వంటి ప్రీమియం కోర్సులకు దోట్లు వేసే వారు 90 శాతం మించనిదే అవకాశం పొందలేక పోతున్నారు.

రిజర్వేషన్ల పుణ్యం ఇది. 80 శాతంతో పాసైన అగ్రవర్ణాల విద్యార్థికి సీటు రాదు, 35 శాతం అత్తెసరు మార్కులు వుంటే అదే కాలేజిలో అదే సీటు హరిజన, గిరిజనాది పిల్లలకు పిల్చి ఇస్తారు. వున్న కొద్ది సీట్లలో కులాల వారీ పంపకం పోను అగ్ర కులా లనబడే అభాగ్యులకు వారికి మిగిలేవి మరీ కొంచం కావడమే ఈ ర్యాంకుల రద్దీకి కారణం.

రాజకీయా వసరాల కోసం నేతలు సృష్టించిన ఈ దౌర్భాగ్య పరిస్థితి నుంచి తమ పిల్లలను రక్షించుకోను తల్లిదండ్రులు పడే ఆరాటం - ప్రైవేటు స్కూళ్లు, కోచింగ్ సెంటర్లకు కనక వర్షం

### డోలేంద్ర

కురిపిస్తుంది. ఎల్‌కెజి నుంచి ఇంటర్మీడియట్ వరకు ప్రైవేట్ స్కూళ్లు, కాలేజిలు తల్లిదండ్రులను దోచుకొంటున్న తీరు చూస్తే కడుపు రగిలి పోతుంది. కాని అది వారి వ్యాపారం, వారిని నిందించడం అనవసరం. విద్యను బజారులో దొరికే అంగడి సరుకుగా కొనుక్కోవడం తప్ప, మరే రూపంలోనూ చదువు కోలేని దౌర్భాగ్య పరిస్థితులు సృష్టిస్తున్న ప్రభుత్వాన్నే మనం నిందించాలి, తూర్పార బట్టాలి.

ఒక మొస్తరు పేరున్న స్కూలులో ఒకటో తరగతిలో పిల్ల వాణ్ని

కొరవ 7 పేజీలో

# గూడూరు రైల్వే స్టేషన్ సిబ్బంది ఇష్టారాజ్యం!

గూడూరు రైల్వే స్టేషన్‌లో పని చేసే పుద్యోగులకు తమ పుద్యోగాల పట్ల మోజుం మొత్తేసిందేమో బినామీ వ్యక్తులతో తమ విధులను నిర్వర్తింప జేస్తున్నారు. స్టేషన్‌లో మూడు టిక్కెట్ కౌంటర్లు వున్నాయి. వీటిలో సీజన్, రిజర్వేషన్, సాధారణ టిక్కెట్ల వ్యాలి కాని డ్యూటీలో వుండాల్సిన ముగ్గురు క్లర్క్‌ల్లో ఒక్కరు మాత్రం డ్యూటీలో వుంది, మిగతా ఇద్దరు స్టేషన్ బయట బాతాఖానీలో మునిగి తేలుతుంటారు. సీజన్ టిక్కెట్లు ఇచ్చే క్లర్క్ - వాటి కోసం వచ్చే వారికి కుంటి సాకులు చెప్పి వెనుకకు పంపిస్తుంటాడు. రిజర్వేషన్ కౌంటర్‌లో ఏనాడూ రిజర్వేషన్ దొరకదు. ఇక్కడి బుకింగ్ క్లర్క్ ఒక బ్రోకర్‌తో లాలూచి పడి బినామీ పేర్లతో రిజర్వేషన్ చేయించి, బ్లాక్ రేట్లకు టిక్కెట్లు అమ్ముతుంటాడని ఆరోపణ. జనరల్ టిక్కెట్ల కౌంటర్‌లోని క్లర్క్ గారు పొరపాటున కూడా ప్రయాణీకులకు చిల్లర ఇవ్వరు. అప్పుడప్పుడు పుద్యోగులు గాక బయటి వ్యక్తులు కూడా కౌంటర్‌లో కన్పిస్తుంటారు. బుకింగ్ సూపర్ వైజర్, స్టేషన్ మాస్టర్లు ఎప్పుడోగాని తమ సీట్లల్లో కనిపించరు.

బ్లాక్ మార్కెట్‌లో టిక్కెట్లు అమ్మకం;
సిగ్నల్ ఇచ్చేదీ కూలీ జనమే;
జాగ్రత్త వడకుంటే ప్రమాదాలు తప్పవు!

వీరి విధులను ఒక స్థానికుడు నిర్వహిస్తుండటం విడ్డూరమని పిస్తుంది. సిగ్నల్ నియంత్రణ కూడా ఇతనే చేస్తూండటం చూసే వారు ఆశ్చర్య పోతారు. పనులు సజావుగా జరిగి పోతుండటం వల్ల ఇబ్బంది లేదు గానీ; పొరపాటున ఏదైనా ప్రమాదం జరిగితే ఎంత మూల్యం చెల్లించ వలసి వస్తుందో? రైల్వే శాఖ ఉన్నతాధి కారులు జోక్యం చేసుకొని పరిస్థితి చక్కదిద్ద వలసిన అవసరం ఎంతైనా వుంది.

## నాయకులు మారనిదే దేశం బాగుపడదు!

ఆత్మకూరు ప్రియదర్శిని రెసిడెన్షియల్ కళాశాలలో గతవారం జరిగిన ఒక కార్యక్రమానికి జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ పి. భీమన్న ముఖ్య అతిథిగా విచ్చేసి రాజకీయ నాయకుల పై విసుర్లు విసిరారు. మన దేశంలో డాక్టర్లు, ఇంజనీర్లు, శాస్త్రవేత్తలకు కొదవలేదు. కాని రాజకీయ రంగమూ బాగు పడనిదే ఏ రంగం పురోగతి సాధించదు. జిల్లాకు విద్యా శాఖాధికారిగా వచ్చి 14 నెలలయ్యింది. ఆత్మకూరు వచ్చినప్పుడు సంగం గ్రామం దగ్గర అసంపూర్తిగా వున్న కల్వర్ట్‌లను చూస్తున్నాను. ఈ పని పూర్తి కాక పోవడానికి పూర్తిగా రాజకీయ నాయకులు బాధ్యత వహించాలన్నారు. పదవ తరగతి వరకు పిల్లలను ఇంగ్లీషు మీడియం స్కూళ్లలో చదివించ వద్దని తల్లిదండ్రులకు సలహా యిచ్చారాయన. కార్యక్రమానికి ఎమ్మెల్యే శ్రీ కొమ్మి లక్ష్మయ్య నాయుడు అధ్యక్షత వహించారు. ప్రొఫెసర్ బి. భాస్కర రెడ్డి, డి. రామిరెడ్డి, ఎస్. మహాదేవ రెడ్డి తదితరులు ప్రసంగించారు.

తడ ఆంజనేయస్వామి గుడి విగ్రహ ప్రతిష్ఠాపన కార్యక్రమంలో వేనాటి మునిరెడ్డికి శాలువా కప్పుతున్న అపోలో పిసిరెడ్డి, ఎక్సైజ్ మంత్రి నల్లపరెడ్డి ప్రసన్న కుమారరెడ్డి; చివర నిలబడి వున్నది ఆలయ నిర్మాత, నిప్పో అధినేత వి. ఓబులరెడ్డి.

# రాపూరు గంజాయి జోరు!

రాపూరును ప్రధాన కేంద్రంగా చేసుకొని ఒక ముఠా గంజాయి అమ్మకాలు సాగిస్తున్నా పట్టించుకొనే అధికారి లేక పోవడంతో ఈ వ్యాపారం మూడు పువ్వులు, ఆరు కాయల్గా సాగిపోతున్నది. మందు ప్రియులు గంజాయిని సగం వరకు నింపిన సిగరెట్లు, బీడీల కోసం ఎగబడు తుండడంతో ఈ వ్యాపారం డక్కిలి, సైదాపురం మండలాలకు సైతం జోరుగా వ్యాపించింది. రాత్రి వేళల్లో వ్యాపారం చేస్తున్న ఈ ముఠా ముందుగా ఎంచుకొన్న కొన్ని దుకాణాలకు సరకు చేర్చడం అది ఉదయానికల్లా హాట్ హాట్‌గా అమ్ముడై పోవడం జరుగుతున్నది. ఈ వ్యాపార నిర్వహణలో మద్య వ్యతిరేక పోరాటం జరిపిన మహిళలే ప్రధాన భూమిక నిర్వహించడం మరీ శోచనీయం. ఎక్సైజ్ శాఖ మత్తు వదిలితే కేజీల కొద్దీ కడప జిల్లా గంజాయి రాపూరులో దొరికి తీరుతుంది.

## రామతీర్థం తిరునాళ్లలో అన్నదానం

రామతీర్థంలోని శ్రీ కామాక్షి దేవి సమేత రామలింగేశ్వర స్వామి బ్రహ్మోత్సవాల్లో భాగంగా 26 తేది కళ్యాణోత్సవం జరిగింది. పెన్నార్ ఆక్వా ఎక్స్‌పోర్ట్స్ లిమిటెడ్ మేనేజింగ్ డైరక్టర్ శ్రీ ఓజిలి కృష్ణారెడ్డి, ఆయన సతీమణి శ్రీమతి పార్వతి ఉభయ దాతలుగా వ్యవహరించారు. 27తేది సముద్ర స్నానానికి విచ్చేసిన 10 వేల మంది భక్తులకు ఉదయం ఆరు గంటల నుండి

# అల్లూరు సర్పంచ్ ఎన్నిక అందరికీ ఆశ్చర్యమే!

రచ్చలు, రావిళ్లు, రక్తపాతం తప్పదని ఊహిస్తుండిన అల్లూరు సర్పంచ్ ఎన్నిక ఏకగ్రీవంగా జరిగి అందరినీ విస్మయ పరచింది. సర్పంచ్‌గా మాజీ ఎమ్మెల్యే కాటంరెడ్డి విష్ణువర్ధన్ రెడ్డి సోదరుడు కోదండ రామరెడ్డి, ఉప సర్పంచ్‌గా మాజీ సర్పంచ్ మేడా అశోక్ కుమార్ రెడ్డి ఇంట్లో మనిషి నాగేంద్ర రెడ్డి ఎన్నికయ్యారు. సర్పంచ్‌గా కుర్చీలో కూర్చొనేందుకు ముందు హేమా హేమీలు నామినేషన్లు దాఖలు చేశారు. వార్డు సభ్యులు కనీసం 50 వేలు ఖర్చు. సర్పంచ్‌గా పోటీ చేసే అభ్యర్థి కనీసం 15 లక్షలు ఖర్చు పెట్టాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఈ స్థితిలో ఇటు, అటు పార్టీ నాయకుల మధ్య ఐక్యతా యత్నాలను మోహన్ రెడ్డి, వెంకట సుబ్బారెడ్డి, బాబూ రావులు ప్రారంభించారు. నామినేషన్ల గడువు ముగిసిన ఆరు గంటలకు ఈ ప్రయత్నాలు • ఫలించాయి. పంచాయితీలోని 19వార్డుల్లో 10 వార్డులు కాంగ్రెస్‌కు, 9 వార్డులు తెలుగు దేశం పంచు కున్నాయి. ఒక సీటులో మాత్రం ఆ తర్వాత రాజీ కుదరక పోటీ జరిగింది. ఇక్కడా అనూహ్యంగా తెలుగుదేశం గెలవడంతో పంచాయితీలో ఇరు పార్టీల బలం సమాన మయ్యింది. రాజీ చర్చల్లో భాగంగా పోటీలో వున్న పలువురిని అదరించి, బెదిరించి ఐక్య కార్యచరణ నాయకులు ఉప సంహరింప జేశారు. ఇటువంటి బాధితులలో కమ్యూనిస్టులు సైతం వున్నారు. తన కుటుంబ సభ్యున్ని సర్పంచ్ కుర్చీలో కూర్చో బెట్టి [illegible] మరోసారి తనకు తిరుగు లేదని చాటాడు. ప్రతి ఎన్నికల్లో విష్ణుకు రొమ్ము ఎదురొడ్డి నిలబడే అశోక్ నామినేషన్ వేసి ఉప సంహరించు కోవడం వెనుక కారణాలు పలువురికి నేటికి ప్రశ్నార్థకంగా వున్నాయి. ఏది ఏమైనా సర్పంచ్‌గా ఎన్నికైన కోదండ రామిరెడ్డికి పెద్ద మనిషిగా పేరుంది. మండలంలో ఎన్నికలు జరిగిన మిగతా 12 పంచాయితీల్లో కాంగ్రెస్, తెలుగు దేశంలు సరి సమానంగా పంచుకొన్నాయి. మండల ఎన్నికలతో పోలిస్తే తెలుగు దేశం కాస్త కుదట పడిందని చెప్పాలి.

## అల్లూరులో వేళాపాళలేని కరెంట్ కోత!

అల్లూరులో వేళాపాళాలేని కరెంట్ కోతతో ప్రజలు అల్లాడి పోతున్నారు. గ్రామీణ ప్రాంతాల్లో విధించాల్సిన ఆరు గంటల కోతకు అదనంగా మరో ఆరు గంటలు స్థానిక విద్యుత్ అధికారులు జత చేస్తున్నారు. విద్యుత్ సిబ్బంది ఇష్టమైతే సరఫరా వుంటుంది; లేకుంటే కోత అమలవుతుంది. ప్రతిదినం కోతకు టైమ్ మారుతూనే వుంటుంది. ముఖ్యంగా రాత్రి పది గంటల పైన విధిస్తున్న అప్రకటిత కోతకు ప్రజలు అల్లాడి పోతున్నారు. అల్లూరు ఫీడర్‌లో కోత విధించి, [illegible] పై దయ తలుస్తున్నట్లు ఎ.ఇ. పై [illegible] విమర్శలు వస్తున్నాయి. [illegible] పరిశీలించి విచారించాలి

# యానాదిరెడ్డి రాజకీయ చాణక్యం ముందు మరొకసారి దేశం బోల్తా?

కావలి డివిజన్‌లో జరిగిన పంచాయితీ ఎన్నికల్లో బలపర్చిన అభ్యర్థులు ఓడి పోవడంతో తెలుగు నాయకులు ఖంగుతిన్నారు. తీర ప్రాంతంలోని అన్నగారి పాలెం, మన్నంగిదిన్నె, చెంచుగాని పాలెం, చెన్నాయ పాలెం పట్టపుపాలెం పంచాయితీల పై తెలుగు దేశం జడ్పీటిసి సభ్యుడు నాయుడు రాంప్రసాద్ ఎంత శ్రద్ధ తీసుకొన్నా ప్రయోజనం లేకుండా పోయింది. ఆముదాల దిన్నె, అనెమడుగు, తుమ్మల పెంట పంచాయితీలను మాత్రం చావు తప్పి కన్ను లొట్ట బోయి దేశం గెల్చుకొన్నది. రూరల్ మండలాధ్యక్షురాలు శ్రీమతి మంజాల తన స్వగ్రామమైన రుద్రకోటలో దేశం అభ్యర్థిని గెలిపించు కోలేక పోయారు. రూరల్ మండల ఉపాధ్యక్షుని స్వగ్రామం అన్న గారి పాలెంలో ఇదే దుస్థితి చవ్చిపడింది. డివిజన్‌లో తెలుగు రాజకీయ కురువృద్ధుడు గొట్టిపాటి కొండప నాయుడు గారు ఈసారి తన ప్రత్యర్థి ఒంటేరు వేణుగోపాల రెడ్డిని జలదంకి మండలంలో మట్టి కరిపించాలని కాంగ్రెస్‌తో పరోక్షంగా చేతులు కలపడంతో 7 పంచాయితీలూ కాంగ్రెస్ గెల్చుకొన్నది. చాలా చోట్ల తన వర్గం అభ్యర్థులను నిలుపు కోవడంలో కొండప నాయుడు విఫల మయ్యారనవచ్చు. కొండాపురం మండలంలో 19 పంచాయితీల్లో 10 కాంగ్రెస్ గెల్చుకొని మండల ఎన్నికల్లో జరిగిన పరాభవానికి ప్రతీకారం చూపింది. దేశం నాయకులు ఎన్నికల ముందు రోజుల్లో చెప్పులు అరిగేలా తిరిగారు. ఎమ్మెల్యే యానాది రెడ్డి గారు మాత్రం కావలిలోనే కూర్చొని ప్రచారానికి కూడా పోకుండా 30 మందికి పైగా సర్పంచ్‌లను నిమ్మోజకవర్గ పరిధిలో గెలిపించుకొని సత్తా చూపారు.

తెలుగు నాయకులు కాళ్లరిగేలా తిరిగినా ఫలితం రాలేదు;
యానాదిరెడ్డి ఇంట్లో కూర్చొని గెలుపుసాధించాడు!

## బొమ్మన్ సుందరయ్యకు జాలర్ల కిరీటం!

తడ మాజీ మండ లాధ్యక్షుడు బొమ్మన్ సుందరయ్య జిల్లా మత్స్య కారుల సంఘం అధ్యక్షునిగా ఎన్నికయ్యారు. ప్రత్యర్థి పై 21 ఓట్ల మెజార్టీ లభించింది. సంఘం జిల్లా అధ్యక్షునిగా రాష్ట్ర మత్స్య కారుల సహకార సంఘంలో ఆయనకు డైరక్టర్ పదవి లభిస్తుంది.

# డికెకాలేజి ప్రిన్సిపల్ పతిదేవుడి కామలీలలు

డికెడబ్ల్యు కాలేజిలో ప్రిన్సిపల్ శ్రీమతి సీతాదేవి గారి పతిదేముడి కామలీలల పై కలెక్టర్‌ను విచారణ జరిపించమని ప్రభుత్వం ఆదేశించినట్లు నమ్మకంగా తెలుస్తూంది. అయితే పంచాయితీ ఎన్నికలలో బిజీగా వున్న కలెక్టర్ గారు అందుకు ఇంకా పూనుకొన్నట్లు లేదు.

డికె కాలేజి ప్రిన్సిపల్ నివాసం కాలేజి ఆవరణంలోనే! ఆమె "భర్త" రామచంద్ర ప్రసాద్ వుండేది అక్కడే. ఆయన గారి పేరులో రామ చంద్రుడున్నా, మనసులో కొంటె కృష్ణుడు కొలువు దీరి వుంటాడట. ఇంచుమించు అరవై ఏళ్ల వయస్సున్న ఈ మగ పుంగవుడికి ఆడ పిల్లలను ఏడ్పించడం సరదా అట. హాస్టల్ గదుల్లోకి వెళ్లి ఆడపిల్లల కొంగు పట్టి లాగడం, బుగ్గ గిల్లడం వంటి చిలిపి చేష్టలు చేస్తుంటాడట. ఈ వికృతాన్ని, వికారాన్ని ప్రిన్సిపల్ గారు చూసీ చూడనట్లు వుండి పోవడంతో ఆయన మరీ బరి తెగించి నట్లున్నారు. ఆడ పిల్లలు స్నానం చేస్తున్నప్పుడు గబుక్కున బాత్ రూమ్‌లలోకి దూరడం; తలుపు పై వేసి వుండే గుడ్డలు ఎత్తుకెళ్లి, దాచిపెట్టి ఆట పట్టించడం; బాత్ రూమ్ తలుపులు బాదడం వంటి ఛండాలపు పనులకూ దిగజారి పోయాడట.

తన పతిదేముడి కామలీలను ప్రిన్సిపల్ గారు మహదా సంతంతో వీక్షిస్తు న్నట్లున్నారు. అందువల్ల ఆ ముసలి మన్మధుడు మరీ పెట్రేగి పోతున్నారు. ఈ నీచ కృత్యాల పై ఎబివిపి విద్యార్థులు ఆందోళన జరిపారు. అసెంబ్లీలోనూ చర్చకు వచ్చింది. కాని పరిస్థితిలో మార్పు లేదు. కలెక్టర్‌ను విచారించమని చెప్పి చేతులు దులిపేసుకున్నది ప్రభుత్వం. ప్రిన్సిపల్ గారిని ఏమిటమ్మా ఈ ఆరోపణలు - అని అడిగితే "నేనేమీ చెప్పను. విచారణ చేసుకో మనండి" అని మొండిగా సమాధాన మిచ్చారామె.

ఆడపిల్లల కాలేజిలో ఈ అసభ్యపు చేష్టలేమిటి? పిల్లలను కంటికి రెప్ప వలె కాపాడ వలసిన ప్రిన్సిపాలే వారి మీదకు తన పతి దేముడ్ని ఎగ్రదోలితే ఇంక ఆ కాలేజిలో ఆడపిల్లలను చేర్పించేదెట్లా? చదివించేదెట్లా? డికె డబ్ల్యు కాలేజికి రాష్ట్రంలోనే పేరుంది. ఎంతో క్రమశిక్షణ కల్గిన సంస్థగా గుర్తింపు వుంది. ఆడపిల్లలకు అన్ని వసతులతో కూడిన అటువంటి కాలేజి జిల్లాలో మరొకటి లేదు. అటువంటి విద్యాసంస్థ ఒక్క వ్యక్తి మద పిచ్చితో భ్రష్టు పట్టిపోవడం అన్యాయం. ప్రిన్సిపల్‌ను, ఆమె పతి దేముడ్ని అక్కడే వుంచి విచారణ జరిపితే ఏ విద్యార్థిని ధైర్యంగా ముందుకు వచ్చి నిజం చెప్ప గలుగుతుంది? ప్రభుత్వం తక్షణం ఆమెనక్కడ నుంచి సాగనంపి, విచారణ జరిపించి, కామలీలల ఆరోపణ రుజువైతే ఆతడ్ని అరెస్ట్ చేయించడం అవసరం. పవిత్రమైన విద్యా సంస్థలు మానసిక దౌర్బల్యాల ఆట స్థలాలుగా మారి పోవడం సహించలేము. ప్రభుత్వంలో కదలిక లేకుంటే తల్లిదండ్రులే పూనుకొని ఆ నీచులకు బుద్ధి చెప్పాలి.

## నెల్లూరు చుట్టుపట్ల

విహార్మకుడు

### పంచాయితీఎన్నికలు- అంతా ప్రశాంతం!

కావలి, నెల్లూరు డివిజన్లలో పంచాయితీ ఎన్నికలు ప్రశాంతంగా జరిగి పోయాయి. గూడూరు డివిజన్‌లో ఈ రోజు (30తేది) పోలింగ్ జరుగు తూంది. పెద్దగా చెప్పుకో దగిన గొడవలు లేవు. ఎన్నిక లంటేనే జనానికి విసుగు పుట్టి పోయింది. ఎవరిలోనూ ఆసక్తి లేదు.

ఫలితాల ప్రకటన నిల్పి వేయమని ఉత్తర్వు లున్నాయి కాబట్టి, అధికారికంగా ఎవరు గెల్చింది చెప్పలేము; పార్టీ రహిత ఎన్నికలు కాబట్టి ఏ పార్టీకి మెజారిటీ అన్నది తేల్చలేము. వివిధ పార్టీలు వేస్తున్న అంచనాలు చూస్తే - తెలుగు దేశం, కాంగ్రెస్ పోటా పోటీగా సర్పంచ్‌లను గెల్చుకున్నాయి. కోవూరు, ఆత్మకూరు, అల్లూరు, కావలి, రాపూరు నియోజక వర్గాల పరిధిలో కాంగ్రెస్ కొంచెం మెరుగు తేలింది. ఉదయగిరి, సర్వేపల్లిలలో తెలుగు దేశం మొగ్గ సాధించింది.

### చక్కెర మంత్రి

చక్కెర మంత్రి శ్రీ నల్లపరెడ్డి ప్రసన్న కుమార రెడ్డి 1తేది నెల్లూరు వస్తారు. 2 తేది కామాక్షి తాయి వారధి ప్రారంభోత్సవం; 3తేది గూడూరు; 4 తేది విడవలూరు. తదుపరి కార్యక్రమం తెలియదు.

### రెండవపంటకు నీళ్లు

నెల్లూరు, కోవూరు తాలూకాల్లో అరవై వేల ఎకరాలలో రెండవ పంటకు నీరు వదులుతున్నారు. నెల్లూరు ఆనకట్ట నుంచి జాఫర్ సాహెబ్ కాలువ, చెబూరు, నైపారు, గంగ పట్నం కాలువలకు; సర్వేపల్లి చెరువు నుంచి ఇస్కపాళెం, గుడ్లూరు వారిపాళెం, వెంకట రెడ్డి పాళెం, నిడిగుంట పాళెం, పుంజాలూరు పాడు, పోలంరాజా గుంట, అనికేపల్లి, పొట్టెంపాడు, ఇస్కపాళెం, వెమిబర్తి, కలివెల పాళెం, కనుపర్తి పాడు గ్రామాలకు నీరు వదులుతారు.

### చిన్నపత్రికల సంఘం

నెల్లూరులో చిన్నపత్రికల వారందరూ కలిసి ఒక కొత్త సంఘం స్థాపించు కున్నారు. దీనికి శ్రీ తుమ్మల సుబ్బారెడ్డి అధ్యక్షుడు; తరాఖా



రమణయ్య ప్రధాన కార్యదర్శి; గూడూరు 'సాయంకాలం' గౌస్ భాషా సహాయ కార్యదర్శి; 'గవర్నర్' సుబ్బారావు, 'శ్రీహిత' రాజేశ్వరమ్మ, కావలి నిజానిజాలు శివరాం ఉపాధ్యక్షులు.

### త్రాగినమైకంలో సిఐ గలభా, అరెస్టు

మొన్నటి వరకు నెల్లూరు క్రైం ఇన్స్‌పెక్టర్‌గా పనిచేసి, ఇటీవలే ఉదయగిరికి బదలీ మీద వెళ్లిన సిఐ శ్రీ కెవి రమణారెడ్డిని ఎస్‌పి పూర్ణ చంద్రరావు గారు స్వయంగా అరెస్ట్ చేశారు. 29తేదీ రాత్రి, నెల్లూరు, చెరువు కట్ట దగ్గర వుండే ఆఫీసర్స్ క్లబ్‌లో తప్పత్రాగి, ఒక కానిస్టేబిల్‌ను కొట్టాడట. అతడు నేరుగా వెళ్లి ఎస్‌పికి ఫిర్యాదు చేయడంతో ఆయన వచ్చి, సిఐని అరెస్ట్ చేశాడు. కానిస్టేబిల్ ఎస్‌పి బంగళాకు వెళ్లి, తిరిగి వచ్చే వరకు కూడా ఒళ్లు తెలియని మైకంలో వుండి నాడంటే, ఆ ఇన్స్‌పెక్టర్ ఎంత డోసు ఎక్కించి వుండినాడో అర్థం చేసుకోవచ్చు.

ప్రొహిబిషన్ న్యూసెన్స్ తప్పించు కోవడానికి అధికారులకు ఈ క్లబ్ బాగా వుపకరి స్తున్నట్లుంది. పబ్లిక్‌గా సీసాలు తెప్పించి, ఎక్కిం చేస్తున్నారు. అందరూ ఆఫీసర్లే కాబట్టి పోలీసులు రారని నమ్మకం. చేటు కాలం దాపురించి పోలీసులే దొరికి పోయారు.

గత వారంలో కూడా ఈ క్లబ్‌లో కొందరు రెవిన్యూ అధికారులు త్రాగి, తన్నుకొన్నారు. ఆ రచ్చ పబ్లిక్ అయిన తర్వాత కూడా సిఐ మళ్లీ అక్కడే త్రాగి తందనా లాడాడంటే ఇంక ఆ క్లబ్ ఏ రూపంలో నడుస్తుండేది అర్థం చేసుకోవచ్చు. కలెక్టర్ గారూ - ఇప్పటికె అందరి పరువూ మట్టి గొట్టుక పోయింది. ఇకనైనా దాన్ని సరిదిద్దండి!

### బాలాజీ లాకర్స్

నెల్లూరు, రామమూర్తి నగర్‌లో బాలాజీ లాకర్స్ సంస్థను మాగుంట వ్యాపార సామ్రాజ్య సర్వ సైన్యాధ్యక్షుడు శ్రీ పివి ప్రసన్నరెడ్డి ప్రారంభించారు. ప్రైవేటు రంగంలో లాకర్లను ప్రవేశ పెట్టిన తొలి సంస్థ ఇది. రిజర్వు బ్యాంకు నిబంధనలు తుచ తప్పకుండా పాటించి మరీ నిర్మించారు. ఆదివారాలతో సహా అన్ని రోజులూ ఉదయం ఏడు నుంచి రాత్రి ఏడు గంటల వరకు పనిచేస్తుంది. గృహిణుల సౌకర్యం కోసం, అంతా ఆడవాళ్లనే నియమించారు సిబ్బందిగా! బ్యాంకులలో లాకర్లు దొరకక ఇబ్బంది పడే వారికి భలే మంచి సౌకర్యం.

### వసంత్ రక్తదానం

పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారి తనయుడు. మూడ్ వచ్చి



పివి జన్మదినం సందర్భంగా రక్తదానం చేస్తున్న పెళ్లకూరు వసంతకుమార రెడ్డి

నప్పుడల్లా రాజకీయాల్లో నాలుగు రోజులు తిరిగి, తర్వాత అంతు లేకుండా వెళ్లి పోయే సీజనల్ యువ పొలిటీషియన్. ప్రధాని పివికి అత్యంత సన్నిహితుడు శ్రీ వసంత కుమార్ రెడ్డి. పివి జన్మదినం సందర్భంగా 28తేది నెల్లూరులో రక్తదానం చేశాడు; అన్నదానమూ జరిపించాడు.

### రాధాకృష్ణారెడ్డి రిటైర్మెంట్

జిప్రప హెడ్మాష్టర్లలో రాష్ట్ర వ్యాప్త గుర్తింపు పొందిన శ్రీ ఎ. రాధాకృష్ణారెడ్డి రిటైరయ్యాడు. రాధా కృష్ణారెడ్డికి ఉత్తమ ఉపాధ్యాయుడుగా, ఆదర్శ హెడ్మాష్టర్‌గా ఖ్యాతి వుంది. జిల్లా కామన్ ఎంట్రెన్స్ బోర్డు కార్యదర్శిగా కూడా వున్నారు. మొన్నటి 10 తరగతి పరీక్షల్లో ఆయన స్కూలు విద్యార్థి వెలగపూడి రాజేష్ నరసింహా రావు రాష్ట్ర స్థాయి ర్యాంకు సాధించాడు. రాధా కృష్ణారెడ్డి మంచి క్రీడాకారుడు కూడా!

# పెండ్లిండ్లు

వరగలి సామ్రాజ్యంలో భాగమైన లింగవరం పెద్ద రైతు శ్రీ కొట్టె జయరామయ్య కుమార్తె; అంటే అమెరికాలో స్థిరపడి, అమెరికన్లకే నాణ్యతా ప్రమాణాలు బోధించే స్థాయికి ఎదిగిన మేధావి, చేపల పెంపకంలో ఆధునిక, సాంకేతిక పరిజ్ఞానాన్ని భారత దేశానికి సరఫరా చేసే అమెరికన్ బయో ప్రాజెక్ట్స్ అండ్ టెక్నాలజీస్ లిమిటెడ్ కంపెనీ ఛైర్మన్ శ్రీ కొట్టె ఉదయ భాస్కర్ సోదరి సరళ; నెల్లూరులో డాక్టర్ మధు సూదన శాస్త్రి ఆస్పత్రిలో వైద్యుడుగా పనిచేస్తున్న డాక్టర్ రవీంద్రనాథ్‌ల పరిణయం 14తేది కస్తూరిబా కళాక్షేత్రంలో జరిగింది.

* * *

తలమంచి, శ్రీ వేగూరు సుందర రాజా రావు కుమార్తె మాలిని; ప్రకాశం జిల్లా శ్రీ చింతపట్ల లింగయ్య కుమారుడు వెంకట నాగేశ్వర రావుల వివాహం 14 తేది పత్రివారి సత్రంలో జరిగింది.

* * *

బోన్‌హాల్‌లో రాజకీయ బంధు మిత్ర పరివార సమేతంగా జరిగింది.

చంద్రయ్యకు బాధ్యతలు తీరిపోయాయి; ఇక నుంచైనా రాజకీయాలలో యాక్టివ్‌గా తిరగ కూడదా?

* * *

ట్యూషన్ల వ్యాపకాన్ని కోచింగ్ సెంటర్ల వ్యాపారంగా మార్చడంలో రాష్ట్రంలోనే ప్రథముడు; ఈనాటికీ కోచింగ్ సెంటర్ల నిర్వహణలో రాష్ట్రానికంతటికీ మార్గదర్శకుడు; సాధారణ లెక్చరర్ నుంచి విద్యా సామ్రాజ్యాధినేతగా ఎదిగినా తొలినాటి వినయం, సంస్కారం, నిరాడంబ రత్వం వీడని సౌశీల్యుడు, స్నేహపాత్రుడు; కుడి చేతితో చేసే సహాయం ఎడమ చేతికి కూడా తెలియనంత గుట్టుగా దానాలు చేసే పరోపకారి, రత్నం విద్యా సంస్థల సముదాయం నిర్వాహకులు శ్రీ కె.వి. రత్నం కుమారుడు వేణుగోపాల్, హిళు



బాలాజీ లాకర్స్‌ను ప్రారంభిస్తున్న పివి ప్రసన్నరెడ్డి; అటు ఇటు, కంపెనీ భాగస్వాములు పార్థసారథి, కెఎల్‌ఎన్ రెడ్డి.

స్టేట్ కో ఆపరేటివ్ బ్యాంకు ఎజిఎం శ్రీ కొనకోటి లక్ష్మిరెడ్డి కుమారుడు; ఆక్వా కల్చర్ రంగంలో ప్రశంస నీయమైన సాంకేతిక నైపుణ్యాన్ని సాధించి, దాన్ని వ్యాపారంగా మల్చుకోవడంలోనూ కృతకృత్యుడైన మిత్రుడు, స్నేహస్వభావి, పొట్టి వాడైనా గట్టివాడు మధుసూదన రెడ్డి, ఎంఎస్‌సి; కడప, శ్రీ ఉడుము సుబ్బరామ రెడ్డి కుమార్తె సురేఖల పరిణయం 15 తేది కడపలో జరిగింది.

రైల్వే స్టేషన్‌లో నిద్ర, ఫుటకొక వూరిలో తిండి అలవాటైన మధును కుదురుగా ఒక చోట కుదేయడానికి చాలా కష్ట పడాల్సి వుంటుందేమో సురేఖకు! కడప ఆడపడుచువు కాబట్టి, భయపెట్టి దారమ్మా దారికి వస్తాడు?

* * *

కెవిఆర్ కుటుంబ రాజకీయ వారసత్వం స్వీకరించ వలసిన అర్హతలన్నీ వుండి, ఆసక్తి లేక తెర వెనుక వుండి పోతున్న మెతక మనిషి, మృదు భాషి, స్నేహశీలి, వివాద రహితుడు, సర్వజన ప్రియుడు, కెవిఆర్ చంద్రయ్యగా పరిచితుడైన కలవకూరు చంద్ర శేఖరరెడ్డి చిన కుమార్తె సుహిత; నెల్లూరు, డాక్టర్ యర్రంరెడ్డి చంద్ర శేఖరరెడ్డి కుమారుడు, అమెరికా అబ్బాయి గిరోర్‌ల పరిణయం 19తేది

పట్నం. శ్రీ జివన్ రామ చంద్ర రావు కుమార్తె రమల పరిణయం 20తేది టిటిడిలో జరిగింది. పెండ్లికి హాజరైన జన సందోహం రత్నం జన ప్రియత్వానికి అద్దం పట్టింది.

## సణుగుడు

4 పేజీకొరవ

చేర్పించాలంటే ముందుగా ఐదారు వేల వరకు ఖర్చవు తున్నది. డొనేషన్, ఫీజు, పుస్తకాలు, యూనిఫారాలు, బూట్లు, టైలు, బ్యాడ్జీలు, బెల్టులు, నోట్సులు, బ్యాగులు, క్యారియర్‌లు... ఒకటేమిటి? పెళ్లయిన ఆడ పిల్లను కాపురానికి పంపడానికి సరవడికలు సమకూర్చి నంత ప్రయాస పడాల్సి వస్తున్నది పిల్లవాడ్ని స్కూలులో చేర్పించాలంటే! ఆ తర్వాత నెలకు వంద నుంచి రెండు వందల వరకు వంతు తున్నారు.

వెయ్యి లేదా రెండు వేల నెల జీతంతో బ్రతికే మధ్య తరగతి కుటుంబీకుడు ఇద్దరు పిల్లలుంటే ఎటువంటి నరక యాతన అనుభవిస్తాడో వూహించడం

వెయ్యి లేదా రెండు వేల నెల జీతంతో బ్రతికే మధ్య తరగతి కుటుంబీకుడు ఇద్దరు పిల్లలుంటే ఎటువంటి నరక యాతన అనుభవిస్తాడో

వూహించడం దుర్లభం. చూస్తూ చూస్తూ మునిసిపల్ లేదా జిప బడుల్లో చేర్చలేరు; ప్రైవేటు స్కూళ్లలో చెర్పడానికి శక్తి చాలదు. ఎన్నో కుటుంబాల వారు తమ పిల్లల చదువుల కోసం చేస్తున్న త్యాగాలు చూస్తుంటే అయ్యో అన్పిస్తుంది. తిండి దగ్గర నుంచి, సినిమాలు షికార్ల దగ్గర నుంచి, కట్టుకునే గుడ్డల దగ్గర నుంచి, ఇంట్లో కనీస సౌకర్యాల దగ్గర నుంచి, ఆస్పత్రులు, మందుల దగ్గర నుంచి జీవితంలో ప్రతినిత్యం, ప్రతి విషయంలో రాజీ పడిపోయి, సర్దుక పోతే తప్ప పిల్లలను చదివించు కోలేని దుస్థితి ఏర్పడి పోయింది. ఇంటర్ చదివే పిల్లలుంటే, గుండె పైన కుంపట్లే! కోచింగ్‌లకు ఫీజులు, రెసిడెన్షియల్ కాలేజిలకు వేలకు వేల ఖర్చు సామాన్యుడు భరించ లేకున్నాడు. తమ సంతానం ఇంజనీరుగానో, డాక్టరుగానో ఎదగాలని ముచ్చట పడిన నేరానికి మధ్య తరగతి కుటుంబీకుడు అనుభవించే ఆర్థిక యాతన, డబ్బు వెతలు వర్ణించడం అసాధ్యం.

ప్రభుత్వాలు ఏటా కొన్ని వేల కోట్ల రూపాయలు విద్యా రంగం పై వెచ్చిస్తున్నాయి. చదువుల కోసం సర్కారు వెచ్చించే సొమ్ములో సగ భాగం సద్వి నియోగమైనా, వాటిని నిర్వహించే వారిలో ఏ మాత్రం చిత్తశుద్ధి వున్నా సగటు జనం ఇంతటి సమస్య లెదుర్కో వలసిన దుర్గతి వుండదు. ప్రైవేటు స్కూళ్లతో పోలిస్తే సర్కారు బడులలోనే క్వాలిఫైడ్ టీచర్లుంటారు; మంచి జీతాలు వస్తాయి. భవనా లుంటాయి. లేనిదల్లా అయ్యవార్లలో శ్రద్ధ, ఆసక్తి మాత్రమే. ఆరేడు వందల జీతానికి ప్రైవేటు స్కూలులో పన్నెండు గంటలు గొంతార్చుక పోయేట్లు పాఠాలు చెప్పి, పిల్లలకు ర్యాంకులు సాధించి పెట్టే పంతులమ్మ- జిపలోనో, మునిసి పాలిటీలోనో ఉద్యోగం రాగానే డిఎలు, అరియర్లు, సిఎల్‌ల లెక్కల్లో మునిగి పోయి చదువు చెప్పే బాధ్యతను మర్చి పోతుంది. కనీస సౌకర్యాలు సమకూర్చి, అయ్యవార్ల చేత రోజుకు ఆరు గంటలు నికరంగా పాఠాలు చెప్పించ గల్గితే పేద, సన్నజనం ప్రైవేటు స్కూళ్లకు ఎగబడ వలసిన అవసరం వుండదు. కాలేజిలలో లెక్చరర్లు ట్యూషన్లకు పారిపోకుండా క్లాస్ రూముల్లో కుదేస్తే, కోచింగ్ సెంటర్ ఫీజులకు నెల జీతాలను హారతి కర్పూరం చేయ వలసిన దౌర్భాగ్యం తప్పుతుంది. అక్కడా, ఇక్కడా చెప్పే చదువు అదే, చెప్పే అయ్యవార్లు వారే; కాని చెప్పడంలోనే తేడా. అంత చిన్న తేడాకు ప్రజల నింత బాధించాలా? సంసారాలు కూలద్రోయాలా? ఏమిటీ దురన్యాయం? ఎప్పుడు వస్తుంది నేతల్లో మార్పు?

* * *

"బ్రిటీషు వారి పరిపాలన వల్లే భారత దేశం ఒకటిగా నిలబడి వుంది. ఎన్నో రాష్ట్రాలు, విభాగాలు, విభేధాలు, రాజులు, రాజ్యాలు కలిసి పోయి ఒక దేశంగా మన గల్గుతున్నది. ఇంగ్లీషు దొరలు చేసిన ఈ మేలు మరువలేము. బ్రిటీషు వారికి మేమెప్పుడూ రుణ పడివుంటాం"

ఈ మాట అన్నది ఎవరో కాదు. మహా ఘనత వహించిన ఆంధ్ర ప్రదేశ్ మహామాత్యులు శ్రీశ్రీశ్రీ నందమూరి తారక రాముల వారు. మొన్నటి ఇంగ్లండు పర్యటనలో ఆయన బ్రిటీషు



నెల్లూరు రాజరాజేశ్వరి దేవాలయం సందర్శించిన కంచి మూడవ స్వామి విజయేంద్ర సరస్వతికి, పూర్ణకుంభ స్వాగతం చెప్తున్న ఛైర్మన్ కె.వి. రాఘవరెడ్డి

వారిని పొగడడానికి చూపిన అత్యుత్సాహంలో చేసిన ప్రసంగాలు, వాగిన వాగుడు భారతీయుల తల కొట్టేసినంత సిగ్గు మాలినవిగా వున్నాయి. వ్యాపారం కోసం ఇండియాకు వచ్చి, రెండు వందలేళ్ల పాటు దేశాన్ని దురాక్రమించి, దౌర్భాగ్య పూరిత పరిపాలన సాగించి, దేశ సంపదను పీల్చి పిప్పి చేసి, భారతీయ పౌరులు నేడను భవిస్తున్న దుర్భర దారిద్ర్యానికి, దుస్సహ వెనుక బడిన తనానికి, దారుణమైన పారిశ్రామిక ప్రగతి లేమికి కారణ భూతులైన బ్రిటీషు వారిని, వారి పరిపాలనను భేష్... భేష్ అని పొగిడి వ చ్చాడంటే ఎన్టీఆర్‌కు నిజంగా మతి చలించిందా అన్పిస్తూంది.

"భారత దేశం బ్రిటన్ పరిపాలన వల్ల క్రమశిక్షణను నేర్చుకొన్నది; ఈ రోజు మేము పార్లమెంటరీ ప్రజాస్వామ్యం నిర్వహించు క గల్గుతున్నా మంటే అది మీరు కరుణించిందే; ఇంగ్లీషు భాషను భిక్షగా పెట్టి మీరు మాకెంతో మేలు చేశారు; నేను తెలుగు వాడినైనా ఈరోజు ఇంగ్లీషులో మాట్లాడు తున్నానంటే మీ చలువే. మా దేశ ప్రజలు, మా రాష్ట్ర పౌరులు మీ పట్ల ఎంతో ఆరాధన కృతజ్ఞత కల్గి వుంటారు"

ఇట్లా సాగిపోయింది ఆయన ప్రసంగం. ఒక రాష్ట్రాధినేతగా, విదేశీ గడ్డ పైన స్వజాతి తల తీసేసే ధోరణిలో ఆయన చేసిన ప్రసంగాన్ని ఏ భారతీయుడైనా ఎట్లా సహించాలి? నాయకులలో ఎందుకింత దిగజారుడు తత్వం పెరిగి పోతున్నది? జాతి గౌరవం, ప్రజల ప్రతిష్టలను కాపాడలేని, వాటి విలువ గుర్తించలేని కుసంస్కారులు, జ్ఞాన శూన్యులు, మానహీనులు మన పరిపాలకులు కావడం కంటె దౌర్భాగ్యం మన దేశానికి మరేదీ లేదు.

బ్రిటన్‌లో వుండే ప్రవాసాంధ్రులు, ప్రవాస భారతీయులను నిధు లడగడానికి, పరిశ్రమలు పెట్టమని కోరడానికి ఇంగ్లండు వెళ్లాడాయన. అంత మాత్రానికి భారత దేశం ఆత్మ గౌరవం తాకట్టు పెట్టాలా? బ్రిటీషు వలస పరిపాలనను ఆకాశాని కెత్తాలా? బ్రిటీషు పరిపాలన వల్ల భారత దేశం ఎంత నష్టపోయింది, ఎన్నెన్ని కష్టాలు పడింది, ఎన్ని శతాబ్దాలు దుర్భర దారిద్ర్యంలో మ్రగ్గింది ఆయనకు తెలియదా? ఎన్ని లక్షల మంది భారతీయులు తమ ఆస్తులు, జీవితాలు, చివరకు ప్రాణాలనుపాలన సైతం పరిత్యజించి స్వాతంత్ర పోరాటం నిర్వహించింది ఎన్టీఆర్‌కు తెలియదా? బ్రిటీషు వలస పాలన పైనపైతే గాంధీ, నెహ్రూలు

నడిపిన స్వాతంత్ర్యో ద్యమం దేశద్రోహ నేరమౌతుంది కదా? భగత్ సింగ్, లాల లజపతి రాయ్, వీరసావర్కార్‌లను క్రిమినల్స్ క్రింద పరిగణిం చాల్సిందే కదా?

జాతి గౌరవం, ప్రతిష్ట పట్ల ఇసుమంత విలువ లేని ఎన్టీఆర్ వంటి మానసిక దుర్బలులు మన నాయకులు కావడం మనం చేసుకొన్న పాపం. ప్రతి తెలుగు వాడూ ఆయన ఇంగ్లండులో చేసిన అపభ్రంశపు వ్యాఖ్యలను సిగ్గుతో తలదించు కోవాలి!

# జిల్లా వార్తలు

5 పేజీకొరవ

మధ్యాహ్నం 2 గంటల వరకు దంపతులిద్దరు అన్నదానం చేశారు. కార్యక్రమంలో నెల్లూరు టౌన్ మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు శ్రీమతి పంచిల్లపల్లి అరుణమ్మ కూడా పాల్గొన్నారు.

## నిరుద్యోగులకు ఎన్నికల డ్యూటీలు!

కావలి మండలంలో 24 తేది జరిగిన పంచాయితీ ఎన్నికల్లో నిరుద్యోగులకు ఎన్నికల డ్యూటీలు వేసి అధికారులు పలువురిని ఆశ్చర్య పరిచారు. కొత్తగా జరిగిన ఉపాధ్యాయు నియామకాలు, తరువాత జరిగిన బదలీల వల్ల సిబ్బంది కొరత ఏర్పడింది. ఎన్నికల ముందు రోజుకు ఈ విషయం అధికారులు గ్రహించ గలిగారు. ప్రైవేట్ పాఠశాలల్లో పనిచేస్తున్న నిరుద్యోగుల వివరాలను అప్పటి కప్పుడు సేకరించి నరాసరి వారి గృహాలకు వెళ్లి లారీల్లో ఎక్కించి పోలింగ్ కేంద్రాలకు తరలించారు. ఎన్నికల నిర్వహణలో తగిన అనుభవం లేకపోయినా తొలిసారిగా లభించిన ఛాన్సుకు నిరుద్యోగులు వుబ్బి తబ్బిబ్బులై తమ విధులను సమర్థ వంతంగానే నిర్వహించారు.

## కావలి టీచర్‌కు జాతీయ అవార్డు!

కావలి ఆంధ్రకేసరి అప్పర్ ప్రైమరీ స్కూల్ ప్రధానో పాధ్యాయురాలు శ్రీమతి చాకలికొండ హైమావతికి జాతీయ ఉత్తమ ఉపాధ్యాయురాలి పురస్కారం లభించింది. ఈ అవార్డును ఉపాధ్యాయ దినోత్సవం ( సెప్టెంబరు 5) రోజు న్యూఢిల్లీలో రాష్ట్రపతి శ్రీ శంకర్ దయాళ్ శర్మ చేతుల మీదుగా ఆమె అందు కొంటారు. 1964 లో ఉపాధ్యాయ వృత్తిని చేపట్టిన హైమావతి 87, 89, 92లో జిల్లా స్థాయిలో; 93 రాష్ట్ర స్థాయిలో ఉత్తమ ఉపాధ్యాయినిగా అవార్డులు పొందిన ప్రతిభాశీలి. హైమావతికి రచనా వ్యాసంగంలోనూ ప్రవేశ ముంది. మానవత్వపు విలువలు



పిల్లల్లో పెంపొందించే విధంగా ఆమె రచించిన 15 నాటికలను విజయవాడ ఆకాశవాణి కేంద్రం బాలానందం కార్యక్రమంలో ప్రసారం చేశారు. ఆంధ్ర పత్రిక, సైన్సు మాస పత్రిక చెకుముకి, అధ్యాత్మిక పత్రిక సప్తగిరిలో ఆమె వ్యాసాలు ప్రచురిత మయ్యాయి. 93లో జరిగిన సైన్సు ఫేర్‌లో ఈమె రూపొందించిన ట్రాన్ పోర్ట్ అండ్ కమ్యూనికేషన్ ప్రదర్శనకు రాష్ట్ర స్థాయి బహుమతి లభించింది.

### పులివెందుల మున్సిఫ్ కోర్టులో

O.S. 174 / 93

స్టేట్ బ్యాంక్ ఆఫ ఇండియా -వాది
పులివెందుల.

మరియు

బడుగు మార్క్ చనిపోయినెందున ఆతని వారసులు

1. బడుగు ఆలీశమ్మ.
2. బడుగు జాన్ -ప్రతివాదులు

**నోటీసు**

పై దావాలో ప్రతివాదుల నోటీసు నిమిత్తమై వాయిదా పై కోర్టులో 24.7.95 తేదిన ఉన్నది. ప్రతివాదులకు అక్షేపణలున్న తెలుపు కొనవచ్చును.

జి. ప్రభాకరశాస్త్రి
వాదితరపు అడ్వొకేటు

### నెల్లూరు సంగతులు

4 పేజీకొరవ

సుదర్శన యాగం జరుగ నున్నది. స్టోన్‌హౌస్ పేట కామిశెట్టి సుందర రామయ్య కళ్యాణ మండపంలో జూలై 1,2 తేదీల్లో ఈ యాగం జరుగుతుంది. 1 తేది ప్రసన్న గాయత్రి వాగ్యజ్ఞం, 2 తేదీ లక్ష్మీ నారాయణ సుదర్శన యజ్ఞం, పూర్ణాహుతి కార్యక్రమం జరుగుతుందని నిర్వాహకులు తెలియ జేస్తున్నారు. యాగంలో పాల్గొన దలచిన భక్తులు పంచపాత్ర, ఉద్ధరిణి, తులసి పుష్పం పూజా ద్రవ్యాలు తెచ్చుకోవాలని కోరుతున్నారు.

## వెంకయ్యస్వామి భక్తుల సమావేశం!

25 తేది రంగనాయకుల పేటలోని మాదాల బాలతిమ్మయ్య కళ్యాణ మండపంలో గొలగమూడి వెంకయ్య స్వామి హ్యూమాని టేరియన్ మిషన్ శాశ్వత సభ్యుల సంఘ సమావేశం జరిగింది. శ్రీ కత్తుల వెంకట రత్నం అధ్యక్షించారు. హ్యూమాని టేరియన్ మిషన్‌కు కొత్త కమిటీని ఏర్పర్చాలని, ప్రస్తుత పాలక కమిటీ చర్యల వల్లే ఆశ్రమ వ్యవహారాలు కోర్టులకు ఎక్కుతున్నామన్న విమర్శలు వినవచ్చాయి సమావేశంలో! గొలగమూడికి వచ్చే భక్తులకు కనీస సౌకర్యాలను పాలక వర్గం కల్పించాలని డిమాండ్ చేస్తూ, నూతన కమిటీ ఎన్నిక కోసం తగిన అనుమతి కోరుతూ జిల్లా జడ్జి గారికి కలెక్టర్‌కు వినతి పత్రాలు సమర్పించారు. కమిటీకి 516 రూపాయలు చెల్లించి శాశ్వత సభ్యత్వం కల్గి వున్న పలువురు ఈ సమావేశంలో పాల్గొన్నారు.

### మేడమ్ లక్ష్మిపార్వతి స్వా(స్వ)గతమ్

ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్‌స్టార్
హౌ ఐ వండర్ ఎన్టీఆర్!!

సూటు, బూటు, హ్యాటు
లండన్‌లో నువ్వే నా స్వీటు!!

రాకండ్‌రోల్, రాకు, బ్రేకు, షేకు
సెకండాఫ్‌లో నేనే నీకు మేకు!!

ట్వింకిల్, ట్వింకిల్, లిటిల్‌స్టార్
హౌ ఐ లవ్ ఎన్టీఆర్!!

అఆ, ఇఈ, ఉఊ.... ఛీఛీ
ఎబిసిడి ఎఫ్... యాయా!!

హాడుయుడు 'బాబు'
హౌ ఈట్ యువర్ హరికృష్ణ

వేరీజ్ మై 'కోటి' 'ముద్దు'
ఐ థింక్ దేవర్ వెరీ హ్యాపీ

ఐలైక్ ఆటిన్ రాణి
ఐ మీట్ లండన్ రాణి
బికాజ్ ఐయామ్ ఆల్‌సోరాణి!!!

ట్వింకిల్ ట్వింకిల్ ఎన్టీఆర్
ఇక పై నేనే సూపర్‌స్టార్!!

ఝునక్ - హైదరాబాదు

### కోర్టులో శిక్షలు

1992 ఏప్రెల్ 10 తేది టౌన్ బస్సును శరవేగంగా నడిపి, రోడ్డు పై సైకిల్ పై వెళ్తున్న ఇద్దరు వ్యక్తులను గాయపరచి నందుకు బస్ డ్రైవర్‌కు జరిమానా విధిస్తూ న్యాయమూర్తి తీర్పు చెప్పారు. వేదాయ పాళెం వద్ద నుండి సైకిల్ పై వెళ్తున్న లక్ష్మయ్య, రత్నమ్మ దంపతులను అజాగ్రత్తగా బస్సు నడిపి గాయపరచి నందుకు డ్రైవర్ శ్రీనివాసులు 1500 రూపాయులు చెల్లించాలని అదనపు మేజిస్ట్రేట్ షేక్ ఇస్మాయిల్ తీర్పు చెప్పారు. చెల్లించి లేకుంటే డ్రైవర్‌కు 45 రోజుల శిక్ష పడుతుంది.

## ముద్దడిగినందుకు ఆరు నెలల జైలు!

జాకీర్ హుసేన్ నగర్‌లో ఒంటరిగా వున్న బీబీజాన్ అనే యువతి వద్దకు సలామ్ అనే యువకుడు తాగడానికి మంచి నీళ్లు అడిగే సాకుతో వెళ్లి, ముద్దు ఇమ్మని అసభ్యంగా ప్రవర్తించిన. నేరం రుజువై నందున నిందితునికి ఆరు నెలల పాటు శిక్షను అసిస్టెంట్ సెషన్స్ జడ్జి మహ్మద్ గౌస్ షరీఫ్ భాషా విధించారు.

### పంచాంగం

**పుష్యమికార్తె**

17తేది సోమవారం దక్షిణాయన పుణ్యదినము

20 తేది గురువారం పుష్యమి కార్తె ప్రారంభం

**జూలై తిథులు**
ఆషాడ బహుళ

తే 15 శని తదియ ఉ.గ. 10.45 వ
తే 16 ఆది చతుర్థి ఉ.గ. 9.20 వ
తే 17 సోమ పంచమి ఉ.గ. 8.19 వ
తే 18 మంగళ షష్టి ఉ.గ. 7.47
తే 19 బుధ సప్తమి ఉ.గ. 7.45 వ
తే 20 గురు అష్టమి ఉ.గ. 8.15 వ
తే 21 శుక్ర నవమి ఉ.గ. 9.13 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | 9672 | 5,000/- |
| | 9674 | 5,100/- |
| జీలకర్ర మసూరి | | 5,000/- |
| బియ్యం బస్తా (70కి) | | 680/- |
| బంగారు సవర (8గ్రా) | | 3,600/- |
| వెండి (10 గ్రా) | | 73/- |

### నీటిమట్టం

| | |
|---|---|
| నెల్లూరు చెరువు | 15.1అ |
| కనిగిరి రిజర్వాయరు | 15.4 అ |
| సర్వేపల్లిరిజర్వాయరు | 7.2అ |



సింహగర్జన చిత్రంలో కృష్ణంరాజు, సురభి

# సెక్స్ లేకుండా ఎంత మోసం చేశావు, రోజా?

"రాజముద్ర" అనే తమిళ చిత్రంలో ఏ మాత్రం సెక్సీగా కనిపించకుండా రోజా నటించిందట. అందుకని ఆమె అభిమానులు "మమ్మల్నెంత మోసం చేశారు" అనే ధోరణిలో ఉత్తరాలు వ్రాశారట. ఇటువంటి అభిమానులను నిరాశ పరచకుండా ప్రతి చిత్రంలోనూ కనీసం రెండు మూడు సీనులైనా సెక్సీగా కనిపించడానికి రోజా నిర్ణయించు కుందట.

## బహువేషధారణ

కొన్ని పాత్రలు ధరించాలని ఆశపడి, అవి దొరకనప్పుడు ఏదైనా చిత్రంలో వేషాల్లో కనిపించి తమ కోర్కె తీర్చుకోవడం కొందరికి ఆనవాయితీ. ఈ కోవలోనే "భారత సింహం" చిత్రంలో కృష్ణ "భగత్‌సింగ్, నేతాజీ, ఆంధ్ర పాపా రాయుడు, కట్టబ్రహ్మన్న" గెటప్స్‌లో కనిపించ బోతున్నారు.

## ఒంగోలులో విచిత్ర ప్రేమికులు

ఒంగోలులో పది రోజుల పాటు షూటింగ్ జరిగిన విచిత్ర ప్రేమికులు చిత్రం తదుపరి షెడ్యూల్ తిరుపతిలో జరుగుతూంది. శ్రీనివాస వర్మ, ఉజ్వల, కాస్ట్యూమ్స్ కృష్ణ, ముత్యాల బాబారావు, స్వరూప్, ఆషా, రేణుక, తిరుపతి దొరై, అత్తిలి లక్ష్మి, దివ్య, చిడతల అప్పారావు, మిఠాయి చిట్టి, చిదానందం, బెల్లంకొండ నటిస్తున్నారు. మాటలు: సూర్యదేవర, సంగీతం: వాసూరావు, దర్శకత్వం: వెంకటేష్. అరకు వేలీలో ఆగస్టులో చివరి షెడ్యూల్ జరుగు తుందని నిర్మాతలు తెలియ జేశారు.

## "ధర్మచక్రం"

"లాయర్‌గా మా అబ్బాయి క్లిష్టమైన పాత్ర ధరిస్తున్నారు" అన్నారు డి. రామా నాయుడు. ఈయన నిర్మించే సురేష్ ప్రొడక్షన్స్ పై చిత్రంలో

## మద్రాసు సినిమా వార్తలు

వెంకటేష్, రమ్యకృష్ణ, గిరీష్ కర్నాడ్, ఎ.వి.ఎస్., బ్రహ్మానందం, రాళ్ళపల్లి, హరనాథ రావు, శ్రీ విద్య, జయలలిత మున్నగు వారుంటారు. సంభాషణలు: ఎం.వి.ఎస్. హరనాథ రావు, కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: సురేష్ కృష్ణ.

## హీరో రాజేంద్ర ప్రసాద్ సంగీత దర్శకుడా?

"టోపీ రాజా - స్వీటీ రోజా" చిత్రంలో రాజేంద్ర ప్రసాద్, రోజా నాయకా నాయికలు, సంగీత దర్శకుడు కూడా రాజేంద్ర ప్రసాదేనట. ఈ

కొరవ 11 పేజీలో

# బిగ్‌బాస్‌తో బాపినీడు పప్పులో కాళ్ళు వేశాడు!

బాపినీడు ఒకప్పుడు చిరంజీవి పత్రిక నడిపాడు. చిత్రాల పబ్లిసిటీల్లో కొత్త కొత్త స్టంటులు వేశాడు. చిరంజీవితో చిత్రం తీసే కథ ఏ విధంగా ఉండాలో తనకు తెలిసి నంతగా మరెవ్వరికీ తెలీదని ఢంకా బజాయించే వాడు. అందుకే ఇతర నిర్మాతలు అన్ని విషయాలలోనూ ఆయన సలహాలు తీసుకునే వారు. ఆయన మాటను వేద వాక్కుగా భావించే వారు. ఆయన మేధావి అని పొగిడే వారు. చిరంజీవి కూడా బాపినీడు సర్వజ్ఞుడని కీర్తిస్తూండే వారు. చివరికి వీళ్ళిద్దరి కలయికలో రూపొందిన "బిగ్‌బాస్" చిత్రం ఆశించినంత బాగా పోవడం లేదని రిపోర్టులు వస్తున్నాయి. ఎందరికో సలహా లిచ్చిన బాపినీడు తన చిత్రం విషయంలో ఎందుకు పప్పులో కాలు వేశాడో ఎవ్వరికీ అంతు పట్టడం లేదు.

## "అర్జున విజయం"

"జూలై 3 నుంచి 25 వరకు జరిగే తొలి షెడ్యూల్‌లోనే ద్రౌపది ఛాంబర్‌లో అర్జునుడుగా, ద్రుపదుడి దర్బార్ సెట్‌లో శ్రీ కృష్ణుడుగా రెండు గెటప్స్‌లో బాలకృష్ణ కనిపిస్తారు. నరేష్ నారదుడుగా గెస్టు రోల్ పోషిస్తారు. ప్రముఖ రంగ స్థల నటుడు ఆచంట వెంకటరత్నంనాయుడు ఒక ముఖ్య భూమికలో కనిపిస్తారు" అన్నారు నిర్మాత బి. వెంకట్రామ రెడ్డి. రోజా, కె.ఆర్. విజయ, కళ్యాణ్ కుమార్, దగ్గుపాటి రాజా, ఎ.వి.ఎస్. శ్రీహరి, వినోద్, శోభన్, మిక్కిలినేని, అత్తిలి లక్ష్మి, విజయా సింగ్ ముఖ్య పాత్రధారులు. రచన, నిర్మాణ సంచలన: రావి కొండలరావు, సంగీతం: మాధవపెద్ది సురేష్, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: సింగీతం శ్రీనివాస రావు.

**అందరికీ సలహాలిచ్చే ఆయనే తప్పుచేశాడు!**

# విజయా ఆస్పత్రి స్థాయిలో భానుమతి ఆస్పత్రి!

భరణి స్టూడియోను భరణి హాస్పిటల్‌గా రూపొందించాలని భానుమతి చిరకాల వాంఛ. అందుకు అవసరమైన యంత్ర పరికరాలను దిగుమతి చేసుకున్నారు కూడా. ఇక కొడుకు భరణి అమెరికా నుంచి మన దేశానికి తిరిగి రావడమే తరువాయి. సమీపంగా ఉన్న విజయా హాస్పిటల్‌కు దీటుగా ఉండాలని భానుమతి సంకల్పం.

## భలే జవాబు

కొందరు అభిమానులు భానుప్రియను షూటింగ్‌లో కలుసు కున్నారు. ఎక్కువ మంది అడిగిన ప్రశ్న "మీరు ఇప్పుడు కాకపోతే మరెప్పుడు పెళ్ళి చేసుకుంటారు" అని; వాళ్ళందరికీ నవ్వే సమాధానంగా చెప్పింది భానుప్రియ. వాళ్ళల్లో ఒక నడి వయసు దాటిన వ్యక్తి కూడా అదే మాట చెప్పి "త్వరగా పెళ్ళి చేసుకుంటే మంచిదమ్మా" అన్నాడు. వెంటనే తన పక్కనున్న మహిళను చూపి "ఈమె మా అమ్మాయి. మీ సినిమాలంటే చెవి కోసు కుంటుంది" అన్నాడు. ఆమె మెడలో మంగళ సూత్రం భానుప్రియకు కనిపించలేదు. "మీ అమ్మాయి వయసెంత?" అని అడిగింది. "ముప్పై ఏళ్లు వస్తోందమ్మా. తగ్గ వరుడెవరూ లభించక ఇంకా పెళ్ళి చేయలేదు" అన్నాడా ఆసామి. అప్పుడు భానుప్రియ "అయ్యో! చూశారా! నా కన్నా పెద్ద అయిన మీ అమ్మాయి పెళ్ళి ఇంకా జరగలేదు. నా పెళ్ళి ఇప్పుడేం అర్జంటట" అంది. ఆ పెద్దాయన నీళ్ళు నమిలాడట.



# పెదరాయుడు

**చిత్రసమీక్ష**

**గ్రిద్దలూరు గోపాలరావు**

"పెద రాయుడు" ఇంటిల్లిపాదీ హాయిగా చూడ తగ్గ మంచి కుటుంబ కథా చిత్రం. ఆది నుంచి అంతం వరకు కథా పరంగా గాని, పాత్రల తీరులో గాని ఇతర అన్ని విషయాల్లోనూ ఆదర్శ వంతంగా సాగుతుందీ చిత్రం. ఎక్కడా అశ్లీల దృశ్యాలు కనిపించవు. ద్వంద్వార్థపు మాటలు వినిపించవు. ఇంత వరకు మోహన్ బాబు నిర్మించిన చిత్రా లన్నింటికీ ఇది పూర్తి భిన్నమైంది.

మోహన్ బాబు ఈ పర్యాయం భిన్నరీతిలో, విభిన్న ప్రవృత్తితో చిత్రం నిర్మించటమే గాక; మానసికంగా స్వరూప స్వభావాల్లో సమతుల్యం గల రెండు ఉదాత్తమైన పాత్రలను పోషించాడు. ఈ రెండు పాత్రలు పెద రాయుడు, రాజా అనే అన్న దమ్ముల పాత్రలు. ఒకే రక్త సంబంధం గల అన్నదమ్ముల మధ్య అమృత సమానమైన అనుబంధం, అనురాగం, ప్రేమ, మమత, మానవత పొత్తుక పోయి వుంటాయి. ఈ ఉత్తమ లక్షణాలు అన్న పెద రాయుడు, తమ్ముడు రాజాలో బాగా పొత్తు ఏర్పరచు కున్నాయి. పురాణ యుగంలోని రామలక్ష్మణుల దివ్య రూపాలను మరిపిస్తాయి ఈ అన్నదమ్ముల పాత్రలు. ఉదాత్తమైన ఈ రెండు పాత్రలను మోహన్ బాబు తనలోని నటనా శక్తి గర్వించ తగ్గంత గొప్పగా పోషించాడు. సంభాషణలు ఉచ్చారణలోను, నటనలోను హుందా తనం కనుపరిచి ప్రత్యేక గుర్తింపును పొందాడు. అందరి ప్రశంసలు అందుకున్నాడు.

చిత్రంలో కనిపించే మరో విశిష్టమైన పాత్ర పెదరాయుడి భార్య లక్ష్మి. సాత్వికమైన మనస్తత్వం గల ఈ పాత్ర కుటుంబ సాంప్రదాయాన్ని సంరక్షించేందుకు చాలా బాగా సహకరిస్తుంది. ఈ పాత్రను భానుప్రియ పోషించి, నటనలో ఒక వాస్యమైన మానా నెలకొల్పింది. సంసార పరమైన లక్షణాన్ని, కుటుంబ విచ్ఛిన్నాన్ని నిరోధించడానికి పడే తాపత్రయాన్ని సామర్థ్యంలోను ఎంతో వైవిధ్యంగా ప్రదర్శించింది. ఆ తర్వాత పాపారాయుడుగా చిన్న పాత్రే అయినా రజనీ కాంత్ సెభాష్ అన్పించారు. అతని వేల్లో చుట్ట బాగా నటించింది అతని కంటే. కథ కె.ఎస్. రవి కుమార్ వ్రాశారు. ఈ కథలో రెండు కుటుంబాలను సృష్టించారు. ఒకటి పాపారాయుడు (రజనీ కాంత్) కుటుంబం. ఆయన వంశం ఆ వూళ్ళో పెద్దరికానికి పెద్ద పీటను పొందింది. తనా మనా అనే బేధంలేకుండా ధర్మ పీఠం అధిష్టించి, ఆ ఊళ్లో జరిగే ఘోరాలకు, నేరాలకు న్యాయం నిర్ణయించి తాము చెప్పే చెప్పిన తీర్పును తుచ తప్పకుండా అమలు పరచటం ఆ వంశం ఆచారం. పాపా రాయుడికి, పెద రాయుడు, రాజా (మోహన్ బాబు) కుమారులు. సజ్జనులు. ఆ వంశంలోని పెద్దరికం వారసత్వంగా వారి సంతతికి కూడా సంక్రమిస్తూ వుంటుంది.

ఇక రెండవ కుటుంబం పాపారాయుడు సోదరిది (జయంతి). ఆ సోదరికి ఒక కొడుకు (అనంత రాజ్) అతను దుర్మార్గుడు. ఒక పేద పిల్లను మాన భంగం చేస్తాడు. అతని అమాను షత్వానికి శిక్షగా ఆ పేద పిల్లను పెళ్ళి చేసుకోమని తీర్పు యిస్తాడు పాపా రాయుడు. అందుకు కోపంగా పాపారాయుడు చెల్లెలు భర్త (చలపతి రావు) పాపారాయుడిని కాల్చి చంపుతాడు. చనిపోతూ తన చెల్లెలి కుటుంబాన్ని పద్దెనిమిది ఏళ్ల పాటు వూరి నుంచి వెలి వేస్తాడు.

ఆ ఊరి పెద్దరికం వారసత్వంగా పెద రాయుడిని వరిస్తుంది. పాపా రాయుడి చెల్లెలు కుమారుడు, పాపా

# జమీందార్ల దౌష్ట్యానికి నాయుడుగారికెంత దోషమో!

గతవారం తరువాయి

"జీవాను, రైత్వారి రైతుల గురించి నీవు వ్రాసిన రిపోర్టు బాగున్నదట. వారిలాగా సివింటలో నీకు [illegible] ఇచ్చింది. అలాగే జమీందారీ రైతుల గురించి బాగా చర్చించు. ఐతే, యీ జమీందారులు చాలా మంది మనలో వుంటున్నారు! జాగ్రత్త" అని హెచ్చరించిరి. ఉప్పు జేసే రైతులు మీ ప్రాంతాల్లో వున్నారు. వారికి యీ గాంధీ - యిర్విను పాక్టు ఉపయోగ పడేటట్లు చూడగలవా" అన్నారు. "అవును, అది కూడా చేయ ప్రయత్నిస్తాను లెండి" అలాగా, కరాచీ కాంగ్రెసు నుండి ఆంధ్రకు వచ్చినా! నాయుడు గారిని కలుసుకున్నా!

## విచారణ సంఘం

1931 ఎండా కాలంలో - ఆల్లూరులో, నెల్లూరు జిల్లా రాజకీయ సభ జరుగు చున్నది. నన్ను పిలిచిరి. నాయుడు గారు జమీందారీ రైతుల కష్టాలను గురించి విచారణ సంఘము యేర్పరచాలనే తీర్మానాన్ని ప్రవేశ పెట్టిరి. దానికి, నన్ను అధ్యక్షులుగా సూచించిరి. "అప్పుడే రీ సెటిల్ మెంటు చేసి, రూపాయకు మూడణాలు అదనపు శిస్తు వేయాలనే ప్రభుత్వ ప్రతిపాదన పై, కొన్నిలు వారి విచారణ సంఘం గొప్ప ఆర్థిక విచారణ జరిపింది; దాన్ని నడిపించిన ఆర్థిక శాస్త్రవేత్త శ్రీ రంగా. ఇప్పుడాయనకు వేయి రూపాయల జీతాలిచ్చారు. ఇప్పుడు గాంధీ శిష్యులై, వుచితంగా యీ విచారణ జరుపుతారు" అన్నారు. ఆ సంఘమునకు నాయుడుగారే కార్యదర్శి. గూడూరు పెల్లేటి వెంకట సుబ్బారెడ్డి మేనకూరు సీతారామ రెడ్డి సభ్యులు.

ఆ విచారణ సంఘాన్ని 'రంగా కమిటీ' అని 'జమీందారీ రైతు' పత్రిక పిలవడం ప్రారంభించింది. ఆ విచారణ సంఘమును ఏర్పరచడంలోనే, నాయుడు గారి రాజకీయ చాతుర్యం పైకొచ్చినది. అప్పటి ప్రభుత్వములో దిరకాయ పీచులాగా, బంధుత్వాల ద్వారా ఆంధ్రలోనున్న ప్రముఖ జమీందారీలలో హెచ్చు మందితో పెన వేసుకొని వుంటూ, వారి అందరి మధ్య అత్యంత ప్రాముఖ్యము పొందిన వెంకటగిరి మహారాజా పాలన పైననే విచారణా? దాన్ని నడుపునది, ఆనాటికి ప్రథమ ఆర్థిక శాస్త్రవేత్తగా ప్రభుత్వముచే గుర్తించబడి, వారి ప్రావిన్షియల్ ప్లానింగు సలహాదారుగా అంగీకరించబడి వుండిన ఆచార్య రంగా అంటూనే జమీందారు

> జమీన్‌రైతుతో ఆచార్య రంగా అనుబంధం- జ్ఞాపకాలు!

లందరికీ గొప్ప ఆందోళన! విచారణ సంఘం గ్రామాల పర్యటన ప్రారంభించినది. దినపత్రికలలో నాయుడు గారు ప్రచారం సాగించినారు. వారం వారం వివిధ జిల్లాలలోని జమీందారీ రైతులు, తమ తమ కష్టాలను తిరిగి తరచు కొంటూ, లెక్కించు కుంటూ, వివరించుతూ, మాకు వ్రాయడం మొదలెట్టిరి. ఆ కథలను మా పత్రిక ప్రచురిస్తూ వుండెను ప్రతివారం. ప్రతి జిల్లాకు, ప్రతి జమీందారీకి వస్తుంటూ, వచ్చే ముందే తమ మెమొరాండంలు తయారు చేసుకోవడం మొదలెట్టి మన్నారు నాయుడు; జమీందారీ రైతు పత్రిక ద్వారా, ప్రతివారం యేదో ఒక హెచ్చరిక చేస్తూనే వున్నారు. ఆంధ్రపత్రికనే, వారికి వార్తా పత్రికగా మార్చుకున్నారు. రైతుల ఆందోళనను దిన దినానికి రాజేస్తూ వచ్చినారు.

ఇదిగో ప్రారంభమైన దన్నారు విచారణ. మనుబోలు చేరిరి. గూడూరులో కూడా విచారణే అన్నారు. ఎప్పుడెప్పుడు వెంకటగిరి చేరుతున్నారు. జమీందారుల కోటలో కలోల మున్నారు. గ్రామాల్లో రైతుల కలకల మున్నారు. వచ్చిరి, వాలిరి, రైతు నాయకులు, కాంగ్రెసు పెద్దలు, అంటూ నాయుడు గారి జమీందారీ రైతు కబుర్లు.

వెంకటగిరిలో 1920లోనే కాంగ్రెస్‌లో చేరి, సంస్థానం వత్తిడులకు లొంగక, బ్రిటిషు వారు, జమీందారుల క్రౌర్యం వల్ల, అంతకు మునుపెప్పుడో యివ్వబడ్డ జాగీర్ గ్రామాన్ని తిరిగి సంస్థానం వశ పరచుకున్నా లొంగ కుండిన గాంధేయులు, నటికి నేనివారు. మహారాజాకు బంధువులైనా, దేశభక్తి ప్రపూరితులై వున్న ఆ సోదరులు, కళ్యాణ రావు, వెంకట రామారావు. మన నాయుడు గారికి మిత్రులు, వారి యింట్లోనే మా మకాము; ఎచ్చటెచ్చట నుండో, ఎందరెందరో, రహస్యంగా, బహిరంగంగా, రైతులు మమ్ము కలిసి కుంటున్నారు. వారందరితో, ప్రథమ చర్చలు నాయుడు గారే జరుపు చున్నారు.

వారిని మా విచారణ కమిటీ ముందు సాక్ష్య మివ్వడానికి తయారు చేస్తూ వుండిరి. [illegible] [illegible] భీతిత్వంతో ఎక్కిక్కి పడాలు అల్లుతూ, వారికి ధైర్యం కరగబోసి, పాల గిన్నెతో అందిస్తూ వుండేవారు, అప్పుడే వెలికి వచ్చినది, ఎవ్వరో భయం, సిగ్గు పడుచూ వుంటె "యినుప దిమ్మలలోన యిరికించి, శిక్షగాంచి, యికిలించు చున్నారు [illegible]" అనే హృదయమును చలికించే పదం వెలికి దెచ్చాను.

మా కమిటీ పోగాం పత్రికలలో వస్తూ వుంటే ఆ చుట్టు ప్రక్కల గ్రామ లన్నిటిలో జమీందారీ వుద్యోగులు విపరీతంగా, ఎవ్వరు వారి సంస్థానానికి విధేయులు, మరెవ్వరు అవిధేయులు అనే లిస్టులు వేసుకుంటూ వుండిరి. అందరినీ బెదిరిస్తూ, కమిటీని బాయ్‌కాట్ చేయమని రైతులను ప్రబోధిస్తూ వున్నారు. అందువల్ల, ప్రతి చోట బహుకొద్ది మందే మమ్ము కలుసు కునేవారు. అందునూ కొందరు రహస్యంగా రాత్రి వేళ, మరికొందరు వారి వీరి ద్వారా మాకు తమ కష్టాల గాథలను, అర్జీలు, నివేదనల ద్వారా తెల్పు తుండేవారు.

అంతగా ఆ విధంగా రైతాంగం జమీందారీ పెత్తనాన్ని చూచి బెదరి పోతూ వుండడం మాకందరికీ రోషమే; నాయుడు గారికి మరింత వుద్రేకం. ఈలాగా యీ రైతు లోకం వుంటే, స్వరాజ్య మెలాగ వస్తుంది? అది వచ్చినా, గ్రామాలలో వున్న యీ ప్రజలు యెలాగా, ఎప్పుడు మేల్కొంటారు, లేచి నిలబడతారు, పౌరుషంగా తమ హక్కులకై పోరాడుతారు? అనుకుంటూ నేను బాధపడుతూ వుంటె, అంత కంటె రోషపడుతున్న నాయుడు, తన్ను తాను సమాళించు కుంటూ, నాకు కొంత "వోర్మి, తాల్మి" సందేశాలను అంది స్తుండినారు.

ఎలాగో వెంకటగిరి సభ జరిపాము - ఆ రథాల రచ్చ వద్ద; అదుకో ఆ ప్రక్క ఆకాశ న్నందుకొంటున్న దివాణపు "పాలెసు"; రాత్రి ఎనిమిదికే మేము చేరగలం. ఆ చీకటిలో, దిక్కు దిక్కు మంటూ నాల్గు లైట్లు. వచ్చిన వారు వొకటి రెండు వందలా, లేక, నాల్గు వందలా అనిపిస్తూ వున్నది. ఐనా వారే నేలు మాకు, అసలు వస్తారా యెవ్వరైనా అని, ముసలి రెడ్డి గారను కుంటూ వుండిరి. "తప్పక వస్తారు, ఎందరో అరుగులు మీద వుంటారు, మరెందరో ఆ సమయానికి వస్తారు, దివాణపు చిన్ని చిన్ని వొకర్లే చెరుకుంటారంటే" అంటూ, అతి వుత్సాహ పరుడు, కష్టాలను లెక్కించక, నిప్పుల్లో దూకుతుండిన కళ్యాణ రావు పల్కుచున్నారు; సభ ప్రారంభ మైనది, ఔబుల్సుకు ముందు పల్చగా వున్నారు. ఆ చివర, యీ చివర, చిలకరింపుగా వచ్చారు. నెమ్మదిగా కుర్చీలలో కూచుంటున్నారు.

నాయుడు గారు లేచారు. తుమ్మెద పాట ప్రారంభించారు. ఏమా కంఠపు గంటలు? ప్రతి మాట కొంరత్నాల రువ్వలు; కొద్ది మందే

తరువాయి 11 పేజీలో

## జనవాణి

3 పేజీ తరువాయి

పన్నుల శాఖలు ఉపశాఖలుగా ఏర్పడ్డాయి. పూర్వం వటవృక్షంగా వున్న రెవిన్యూ శాఖ పలు శాఖలై చిన్నా భిన్నం అయింది. మండల వ్యవస్థ ఆవిర్భవించిన తరువాత రెవిన్యూ శాఖ ఇంకా బలహీన పడిపోయింది. ప్రస్తుతం ఆ శాఖకు సంబంధించిన కార్య కలాపాలు సక్రమంగా జరగడం లేదు. శాఖ నిర్వహించ వలసిన పైర్ల సాగుబడి, అధికార్ల అజమాయిషీ, శిస్తు వసూలు, ప్రభుత్వ భూముల పంపిణీ, ప్రభుత్వ ఆస్తుల సంరక్షణ, చౌక డిపోల తనిఖీ నామ మాత్రమే అయ్యింది. అధికారుల ఉదాసీనత వల్ల ఆ శాఖ ప్రమాణాలు నీరుగారి పోతున్నాయి. దీన్ని పటిష్ఠ పరిచేందుకు ప్రభుత్వం తగిన చర్యలు తీసుకోవాలని మనవి.

వెంకటగిరి -పి. రాజయ్య

### రైతు లోకం రంగాగారిని మరవదు!

స్వాతంత్ర్య సమర యోధుడు, మాజీ పార్లమెంటు సభ్యులు శ్రీ ఎన్.జి. రంగా మరణం రైతు లోకానికి తీరని లోటు. రైతు సంక్షేమం కోసం పార్లమెంటులో రంగా చేసిన పోరాటం రైతు లోకం ఎన్నడూ మరవ జాలదు. యావత్తు రైతు కుటుంబాలు రంగా గారికి ఋణపడి వుంటాయి. ఆయన జీవితం నేటి నేతలకు ఆదర్శ ప్రాయం కావాలి. భావితరాల వారు రంగా గారి గూర్చి తెలుసు కునేందుకు కళాశాల స్థాయిలో విద్యార్థులకు ఆయన జీవితం పాఠ్యాంశంగా పెట్టాలి. ఆయన జన్మ దినాన్ని జాతీయ రైతు దినంగా ప్రకటిస్తే బాగుంటుంది.

నెల్లూరు -పి. రవికుమార్

### ఆర్థిక ప్రాతిపదికన రిజర్వేషన్లు!

రిజర్వేషన్ పద్ధతి మన దేశంలో వెర్రి తలలు వేస్తున్నది. ఇటీవల ఉత్తర ప్రదేశ్‌లో ఇంజనీరింగ్ ప్రవేశ పరీక్షలలో 900 మార్కులకు గాను 1 మార్కు వచ్చిన విద్యార్థికి ఎస్‌టి కేటగిరిలో సీటిచ్చారు. అదే విధంగా మధ్య ప్రదేశ్‌లో 900 మార్కులకు 20 మార్కులు తెచ్చుకొన్న విద్యార్థులు ఎస్‌సి కోటాలో సీట్లు పొందారట. ఈ వార్త పత్రికల్లో చదివి ఆశ్చర్య పోయాను. ఈ విద్యార్థులు ఇంజనీరింగ్ డిగ్రీలు తీసుకొని వుద్యోగంలో చేరితే బ్రిడ్జిలు కూలడం, డ్యాములు, రోడ్లు కొట్టుక పోవడం ఖాయం. రాజకీయ నాయకులకు రిజర్వేషన్లు ఆశా సౌధాలుగా మారిపోయాయి. మన రాష్ట్రంలో చిత్తూరు, కృష్ణా జిల్లాలో అగ్ర కులాల వారు కొంత కాపులుగా వ్రాయించుకొని రిజర్వేషన్ కోటా క్రింద అన్ని సౌకర్యాలూ పొందు తున్నారు. కోట్ల విజయ భాస్కర రెడ్డి, ముద్రగడ పద్మనాభం మొన్నటి ఎన్నికల ముందు కాపులు, ముస్లింలను బిసిలో చేర్చి తగినపటమిని బహుమతిగా పొందారు. రిజర్వేషన్లు [illegible]గా కొన్ని కుటుంబాల వారు మాత్రమే పొందుతూ కోటీశ్వరులై పోతున్నారు. అగ్రకులమని పేదవారు నేలకంటి పోతున్నారు. ఆర్థిక ప్రాతిపదికన రిజర్వేషన్లు ఏర్పరచాలని మన నేతలు గ్రహిస్తేనే దేశం బాగుపడుతుంది.

గూడూరు -అవులకొండయ్య

### నేతాజీ నగర్ వాసుల గోడు

పొదలకూరు రోడ్డులో నీళ్ల ట్యాంకు దగ్గర టౌన్ బస్సు స్టాపింగ్ వుంది. ఇక్కడ బస్సు దిగి కొద్ది దూరం నడవగానే పెద్ద గోతి వుంది. నీటి సరఫరా ఏర్పాట్లు సరి దిద్దే మొయినే ఈ గోతి. పైన ఎటువంటి కవర్ లేక పోవడం వల్ల రాత్రి వేళల్లో ఆ మార్గాన నడిచే వారు ఈ గోతిలో పడి గాయపడుతున్నారు. ఈ వార్డు కౌన్సిలర్ గెలిచాక సమస్యల విషయం మర్చిపోయి సుదీర్ఘ నిద్రలో వున్నట్లున్నారు. మునిసిపల్ అధికారులు, ఛైర్మన్ అయినా ఈ సమస్యను పరిష్కరించాలి.

## తెలుగుదేశం

12 పేజీ తరువాయి

(లక్ష్మీపార్వతి ముద్దుగా పిలుచుకునే పేరు) కి మాత్రం అంతః పురంలో రాజ మార్గం నుంచే నేరుగా ప్రవేశం కలుగుతోంది. దీనితో ఎన్టీఆర్ కొడుకులు రెచ్చిపోయి ఎన్టీఆర్‌కు ఫిర్యాదు చేశారట. అయినప్పటికీ కోటి ప్రవేశానికి ఎటువంటి అనుమతి కాని అడ్డంకులు గానీ ఎదురు కావటం లేదు. రోజుకు ఒక్కసారైనా కోటి అంతః పురానికి వచ్చి అమ్మతో అంతరంగిక విషయాలు మాట్లాడి వెళ్తున్నాడు. దీంతో కోటికి ప్రత్యేక గుర్తింపు వచ్చి కోటి బాబుకు కోటి దండాలంటూ జనం అతడి చుట్టూ మూగు తున్నారు. కోటిని ఎన్టీఆర్‌కు వారసుడిగా చేయాలన్న ఎన్ని కోరిక లక్ష్మీపార్వతిని వేధిస్తోంది. ముందుగా నటనలో ఎన్టీఆర్ అంతటి నటుడిగా నిలబెట్టడానికి లక్ష్మీపార్వతి ప్రయత్నిస్తోంది. కోటికి పౌరాణిక పాత్రల్లోని దుర్యోధనుడు, కృష్ణుడు, రాముడు వేషధారణ చేయించి, ఏకపాత్ర మాదిరిగా డైలాగులు చెప్పించి వీడియోలో చిత్రీకరించారు. ఆ తర్వాత సినిమా ప్రింట్‌లో 4 రీల్లు తీసి థియేటర్‌లో వేసుకొని మరీ చూసిందట. ఓ పైన్ మార్నింగ్ సినీ హీరో మోహన్ బాబును పిలిచి కోటిని ఆయన చేతుల్లో పెట్టి అంతా [illegible] అనేసరికి మోహన్ [illegible] అన్నట్టు వినికిడి. [illegible] అధినేత డి. రామానాయుడు ప్రత్యేకంగా లక్ష్మీపార్వతి [illegible] సింగిల్ పాయింట్ [illegible] లక్ష్మీపార్వతి [illegible] ఆమె కాదు ఆమె లక్ష్మి సరస్వతి పార్వతిలా త్రిదేవి అంటూ పొగడ్తల్తో ముంచెత్తు తున్నాడు. లక్ష్మీపార్వతి అంగీకరిస్తే తన సినిమాకు పాటలు రాయిస్తా నంటున్నాడు. ఇదే అవకాశమని లక్ష్మీపార్వతి కోటిని రామానాయుడి చేతిలో పెట్టినా ఆశ్చర్యం లేదు... పో... తెలుగు ప్రేక్షకులు కోటి బాబు దెబ్బ రుచి చూడ్డానికి సిద్ధంగా వుండాలన్న మాట.

> 50 ఏళ్ళ క్రితం
> 3 పేజీ తరువాయి

### నాటకాల పురాణం

23 తేది చింతామణి నెల్లూర్లో - ఋష్యేంద్ర మణి నిడిముక్కల, కొచ్చెర్ల కోట, సూరవరపు ఆర్టర్లు - గోపాల స్వామి దేవాలయ మేజావాణితో కథ ప్రారంభం కావడం ఋష్యేంద్రమణి ప్రత్యేకత. ఈ భరత నాట్యం గత పర్యాయం చక్కగా రక్తి గట్టింది. ఆక్కర్లో ఋష్యేంద్రమణి నటనా కౌశలాదుల గూర్చి మళ్లీ మళ్లీ వ్రాయడం చర్విత చర్వణం. కొచ్చర్ల కోటపాట దగ్గినా ఫర్వాలేదు. నను దేవేంద్రుని పద్యాలు పులి పాటతో పోటీ పెట్టకుంటె లాభం లేదు. నిడిముక్కలను తగ్గుస్థాయిలో పాడి అరుచి ఎట్లా వుంటుందో ప్రేక్షకులకు వినిపించమని అడగ వచ్చునా?

- చిత్రగుప్తుడు

## రామానాయుడు

10 పేజీ కొరవ

చప్పట్లు అందించారు. చిలుక పాట సాగించారు. మరికొన్ని చప్పట్లు సభలో ఋల్లం చేరుతున్నది. సీతారామ రెడ్డి గారు మెల్ల మెల్లగా - రైతులు తమ కష్టాల గురించి తెలుపు కోడానికి జమీందారుగారు ఎందులకు ఆందోళన పడాలన్నారు? ఉద్యోగు లెందుకింత చిందులు త్రొక్కుతున్నారు? అనేసరికి, దివాణపు వైపుగా వున్న వరండా నుండి కొందరు నవ్వడం ప్రారంభించారు. నాయుడు గారికి కోపం, కళ్యాణ రావుకు శివం. మా ముందే కూర్చున్న వారికి వుద్రేకం కల్గింది. "ఏమి, మా సభ జరుపు కోకూడదా, నాయుడు గారూ, రంగా గారిని మాట్లాడ మనండి, వీరి సంగతి చూస్తాం" అంటూ వుండినారు.

అంత, "మా కొద్ది జమీందారీ పొందు. మా ప్రాణాల పై పొంచి, మానాలు హరియించు మా కొద్ది జమీందార్ల పొందు" అనే జేగంట మ్రోగింది. పదం తరువాత పదం. రోషారుణ కాంతులు; రైతుల వద్ద చెకు ముక్కిరాయికి దూది అంటుకున్నట్లు ప్రతి ధ్వనించు తున్నది.

"అయ్యా, మీరు లేస్తారా? ఐతే. ఒక మాట ముందు వీరికి అందించ నివ్వండి" అన్నారు నాయుడు.

యీ మారు మళ్లా ఎన్నికల్లో రంగా నిలబడుతారు; అప్పుడు యీ దివాణం వారు సహాయం చేస్తా మంటున్నారు. అని పల్కుచుండినారు "రానేరారా రంగాగారు" అని యిందరో నన్ను అడుగు చున్నారు నెల్లూరులో; అప్పుడు అన్నారు, దేశభక్తురాలు కనకమ్మ. "రంగాను వీరెవ్వరయ్యా కదలించ కల్గెది? అనాడు బ్రిటీషు గవర్నరు, రెండు వేల జీతం. ఎన్నో వుద్యోగాలు, ఎంతో బిరుదులు. ఆ కాలేజి ప్రిన్సిపాలు అందిస్తా మంటే వినకుండా గాంధీజిని కౌగలించు కున్నవారు" అన్నారు. ఆ ధైర్యంతోటే, కమిటీ విచారణ ప్రోగ్రాం యేర్పరచా నండి. రైలు వద్దకు వెళ్లాం. రారేమోననే భయంగా వున్నా, ఆశతో ప్లాటు ఫారం మీద వున్నాం! దిగారు మూడో తరగతి పెట్టె నుండి; మేము గెంటో తరగతి పెట్టె వద్ద వుంటిమి. వెనుకటి పలె నూటులో హోదాలో ఆర్భాటంతో వస్తారని. శుద్ధ ఖద్దరుతో వున్నారు. టోపీ చూస్తూనే "వచ్చారు రంగాగారు, నేను చెప్పలేదా, తప్పక వస్తారని" అందరితో అన్నా. అలాగా అందిన ఈ రంగా గారు మాట్లాడ తారున్నారు".

(కొరవ పై వారం)

### అప్పు చేసి పప్పుకూడు

-జయంపుకృష్ణ

అప్పుచేసినా పప్పులురావు<br>
పప్పుకూడు తినేరోజులు లేవు<br>
బీదాబిక్కి జనం కూరపచ్చడి<br>
పచ్చడిలోకి పప్పులేదుఉప్పులేదు<br>
మోకాళ్ళతో పొయ్యి తగలేసినట్టుంది<br>
కిలోపప్పు ముప్పయి రూపాయలు!<br>
మరి ఏం కొనాలి? ఏం తినాలి??<br>
మేం పండించిందంతాఏమౌతుంది?<br>
యాడకు పోతావుందాదో మరి!<br>
అట్టడుగు బతుకులకుగంజినీళ్లైనా?<br>
ఉత్తుత్తిమాటలతోకకడుపునిండేనా?<br>
పనిచేసినాపప్పులేం ఉడకడం లేదు<br>
మా రెక్కల తిప్పలు తప్పడం లేదు<br>
ఓతెలివి మెలితిరిగినమేధావులారా!<br>
మేమూమీలాంటిమనుసులమేగదా?<br>
పండగనాడుకూడామాకుపప్పులేదా?<br>
మరిఉండేదెప్పుడు?<br>
మాకడుపు నిండేదెప్పుడు?

"అప్పుడిచ్చటి కొచ్చారే యీ రంగా గారు. వీరితో చదువు కొన్నవారే ఆ యింగ్లాండులో యీ జమీందారు వారి దివాన్జీ సుబ్బారావు గారు. వీరందరికీ పెద్ద, ఐ.సి.ఎస్., రామకృష్ణ గారు రంగాను యిచ్చటికి పోవద్దన్నారు జమీందారు గారి తరపున; ఎన్నో భయాలు కల్గించారు. యింకా బలియమైన ఆశలు అందించారు. వాటికి లొంగ లేదు వీరు! ఎందరో చెప్పినారు నాకు - రంగా యెలా వస్తారయ్యా, వారికి గురువులైన వారే అడ్డగిస్తున్నారు; వెంకటగిరి కుమార రాజా, శాసన సభా సభ్యులు, ఆ రామకృష్ణకు స్నే- ... రంగా గారు ఎన్నికల్లో నిలబడితే క్రిందటి మారు, వెంకటగిరి వారు వోడించారుగా.

### చిత్రసమీక్ష

9పేజీ కొరవ

రాయుడి వంశం మీద ప్రతీకారం సాధించేందుకుగాను పెద రాయుడు తమ్ముడైన రాజాను ఒక హత్యా నేరంలో ఇరికిస్తాడు. తన తమ్ముడు నిజంగానే నేరస్తుడని భావించి పెద రాయుడు అతడ్ని అతని భార్యను వెలివేస్తూ తీర్పు యిస్తాడు. తన తమ్ముడు నేరస్తుడు కాదని ఆ తర్వాత తెలుసుకున్న పెద రాయుడు బాధతో ప్రాణాలు వదులుతాడు. పాపా రాయుడు చెల్లెలు, దుర్మార్గుడైన తన కొడుకును నరిపేస్తుంది.

దర్శకుడు రవిరాజా పినిశెట్టి ఈ కథను తన ప్రతిభా పాటవాలతో చక్కని చిత్రంగా మలిచారు. ప్రతి సన్నివేశంలో మంచి చెడుల సంఘర్షణ కనిపిస్తుంది. ఆ సంఘటనలను దర్శకుడు చాలా హృద్యంగా చిత్రీకరించారు. ఒక ఉమ్మడి కుటుంబంలో పెద్ద కొడుకు, పెద్ద కోడలు బాధ్యత లేమిటి, మిగిలిన కుటుంబ సభ్యులు ఎట్లా ప్రవర్తించాలి వంటివన్నీ చక్కగా చూపాడు దర్శకుడు. అందుకే ఇది ఆదర్శ వంతమైన కుటుంబ చిత్రం.

### సినిమా

9పేజీ కొరవ

చిత్రంలో మ్యూజిక్ సక్సెస్ అయితే రాజేంద్ర ప్రసాద్ మరికొన్ని చిత్రాలకు సంగీత మిస్తాడట.

### ఎడిటర్‌గా దాసరి

"కృష్ణంరాజు, వినోద్ కుమార్ పోలీస్ ఆఫీసర్లు, దాసరి నారాయణ రావు ఒక దిన పత్రిక ఎడిటర్. ఈ ముగ్గురూ న్యాయం కోసం పోరాడుతారు" అన్నారు డైరక్టర్ తరణి. ఈ చిత్రంలో ఇంకా అలీ, నూతన్ ప్రసాద్, రాళ్ళపల్లి, శ్రీ విద్య ఉన్నారు.

### జంధ్యాల దర్శకత్వం

చాలా కాలం తర్వాత జంధ్యాల రచన, దర్శకత్వంలో ఒక చిత్రం తయారు కానున్నది. డి. రామా నాయుడు నిర్మించే సురేష్ ప్రొడక్షన్స్ చిత్రంలో హరీష్ హీరో.


జమీన్‌రైతు

సంవత్సర చందా రూ. 100/-<br>
అర్ధసంవత్సర చందా రూ.50/-<br>
విడిప్రతి రూ. 2/-

# అమ్మగారి షికారు ఖర్చు అధికార పద్దులోనే సర్దుబాటు!

హలో... హలో... సిఎం గారా!

హలో... ఎస్... సిఎం స్పీకింగ్!!

నమస్కారం సార్... నేను... తమ సెక్రటరీని మాట్లాడు తున్నాను.

ఎస్.. చెప్పండి! అక్కడ అంతా బాగానే వుంది కదా!

సార్! పంచాయితీ ఎన్నికల పోలింగ్ అయింది. స్థానిక గొడవలు, నక్సలైట్ల బెదరింపులు తప్ప అంతా సవ్యంగానే వుంది సార్!

ఫలానా.... ఫైలు పై తమ సంతకం కావాలి సార్!

ఒకె... మీరు నోట్ ఫైల్ ఫ్యాక్స్‌లో పంపండి మేం... సంతకం చేసి తిరిగి ఫ్యాక్స్ చేస్తాం...."

రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్టీ రామారావు బ్రిటన్ నుంచి పై విధంగా రాష్ట్ర పరిపాలన కొన సాగిస్తున్నారు. వారం రోజుల పాటు బ్రిటన్ పర్యటన నిమిత్తం శ్రీ లక్ష్మిపార్వతి సమేతంగా ఎన్టిఆర్ ఈ నెల 21న బయలు దేరి వెళ్లిన విషయం పాఠకులకు తెలిసిందే. ముఖ్యమంత్రి విదేశీ పర్యటనకు వెళ్లే ముందు రాష్ట్రంలో ఇన్‌ఛార్జిగా నెంబర్ టూను నియమించి వెళ్లడం ఆనవాయితీ. ప్రస్తుతం క్యాబినెట్‌లో ముఖ్యమంత్రి వేరెవరినైనా ఇన్‌ఛార్జిగా పెడితే ఇంటిగుట్టు రచ్చ కెక్కుతుంది. అందుకే ఫ్యాక్స్ సాక్షిగా లండన్ నగరం నుంచి పరిపాలన చేయటానికి ముఖ్యమంత్రి నిర్ణయించు కున్నారు. ఈ మేరకు ముఖ్యమంత్రి అంత రంగిక సిబ్బంది ప్రతి రోజూ రెండు మూడు సార్లు ముఖ్యమంత్రిని సంప్రదిస్తున్నారు. కాగా తనను ఇన్‌ఛార్జ్‌గా పెట్టనందుకు

**రాజధాని రాజకీయం**

చంద్రబాబు గుర్రుగా వున్నారు. ఎన్టీఆర్‌ను బ్రిటన్ పర్యటనకు విమానం ఎక్కించిన తర్వాత పంచాయితీ ఎన్నికల సాకుతో బాబు చిత్తూరు జిల్లాకు వెళ్లిపోయారు.

## పర్యటన అధికారికమే

లండన్ నగరంలో తెలుగు సమితి ఆహ్వానం పై ముఖ్యమంత్రి బయలుదేరి వెళ్లారు. అయితే పూర్తిగా ప్రైవేటు వ్యవహారాలకు పరిమితమైన ఈ పర్యటనకు అధికార లేబిల్ తగిలించారు. సాధారణంగా ఆరోగ్య రీత్యా చికిత్స ప్రభుత్వం భరించాల్సి వుంది. అయితే లక్ష్మిపార్వతి కూడా చెట్టా పట్టా లేసుకుని విమానం ఎక్కేయటంతో ఆమె ఖర్చులు కూడా ప్రభుత్వం భరించే విధంగా అస్మదీయ అధికార గణం నిబంధనల్ని సడలించారు. ముఖ్యమంత్రి బ్రిటన్‌కు చేరుకున్న మరుసటి రోజు నుంచే విందులు మొదలయ్యాయి. బ్రిటిష్ హై కమీషనర్ సి.ఎం. గౌరవార్థం ఇచ్చిన విందులో ఎన్టీఆర్ ఉద్వేగ పూరితమైన ఉపన్యాసం చేశారు. రాష్ట్రంలో ప్రవాసాంధ్రులు పెట్టుబడులకు రాష్ట్ర ప్రభుత్వం పూర్తి భద్రత చేకూరుస్తుందని ఎన్టీఆర్ హామీ ఇచ్చారు. లండన్ నగరంలో స్థిరపడిన భారతీయులు ముఖ్యంగా ఆంధ్రులు ముఖ్యమంత్రి దంపతుల్ని నెత్తిన పెట్టుకొని చూసుకున్నట్లు వార్తలు అందాయి. వారం రోజుల పాటు పర్యటనలో రెండు రోజులు ఆరోగ్య పరీక్షలు చేయించుకొని అక్కడి నిపు...లు సలహా తీసుకున్నారట.

## "లక్ష్మి" తనయుడు "కోటి"శ్వరప్రసాద్

బ్రిటన్ పర్యటనకు బయలు దేరే ముందు హైదరాబాదు విమానా



తడదగ్గర ఆంధ్రా బార్డర్‌లో నిప్పో ఒబులరెడ్డి గారు నిర్మించిన నిలువెత్తు ఆంజనేయస్వామి విగ్రహ సుందర రూపం

పడ్డారు. ఈ సందర్భంగా విమానా శ్రయంలో ప్రత్యేక వేదిక ఏర్పాటు చేయడంతో ఎన్టీఆర్ మైకు అందుకొని

వరకు గుంటూరులో అయిన వాళ్ల దగ్గర పెట్టి, ప్రస్తుతం హైదరాబాదులో నివాసం పెట్టించింది. హైదరాబాదులోని

# 'కోటి' బాబుకు కోటి దండాలు పెడుతున్న తెలుగుదేశం!

చిన్నల్లుడు శ్రీ నారా చంద్రబాబు నాయుడు నంబర్ టూగా చెలామణి అవుతున్నారు. తన అల్లుడే అయినా చంద్రబాబును ఇన్‌ఛార్జ్‌గా పెట్టడానికి ఎన్టీఆర్ ససేమిరా అంగీకరించలేదు. పంచాయితీ ఎన్నిక లున్నాయి కాబట్టి ఇన్‌ఛార్జ్‌గా ఎవరినైనా నియమిస్తే బాగుంటుందేమో సార్... అంటూ కొందరు మంత్రులు, ఉన్నతాధి కారులు సూచించి నప్పటికీ ఎన్టీఆర్ వారి మాట పట్టించు కోలేదు. చంద్రబాబు నాయుడు మీద ఎన్టీఆర్ కారాలు మిరియాలు నూరుతున్నారు. చంద్రబాబును కాదని నిమిత్తం ముఖ్యమంత్రి విదేశాలకు వెళితే ఆయనతో పాటు ఎవరైనా ఒకరు తోడుగా వెళ్లవచ్చు. అయితే ప్రస్తుత

**పార్వతీ తనయుడి ప్రాభవం- ఎన్టీఆర్ తనయుల ఆగ్రహం!**

పర్యటన రాష్ట్రంలో ప్రవాసాంధ్రుల పెట్టుబడుల్ని ఆహ్వానించ డానికని నిర్దేశించారు. ఇటువంటి పర్యటనకు ముఖ్యమంత్రి ఖర్చులు మాత్రమే

శ్రయంలో ముఖ్యమంత్రి దంపతులకు ఘనంగా వీడ్కోలు చెప్పారు. ముఖ్యమంత్రి దంపతుల్ని చంద్రబాబు స్వయంగా వెంట బెట్టుకొని వచ్చారు. అధికార, అనధికార గణం, పచ్చ చొక్కా తమ్ముళ్లు పట్టలేని ఆనందంతో అన్నా వదినలకు టాటా చెప్పడంలో పోటీ

వేదిక ఎక్కి ఉపన్యాసం దంచారు ఉన్నట్టుండి పత్రికా ఫోటోగ్రాఫర్ల కెమెరాలన్నీ ఒక కుర్రాడి మీదకు ఎక్కు పెట్టడంతో అక్కడున్న జనం దృష్టి అటు వైపుకు మళ్లింది. నూనూగు మీసాలతో సిగ్గు పడుతూ లక్ష్మిపార్వతికి టాటా చెబుతున్న ఆ కుర్రాడు- వీరగంధం కోటీశ్వర ప్రసాద్; సాక్షాత్తు లక్ష్మిపార్వతి, వీరగంధం వెంకట సుబ్బారావుల ఏకైక సంతానం. లక్ష్మిపార్వతి వీరగంధంతో విడాకులు తీసుకున్న దగ్గర నుంచి కోటీశ్వర ప్రసాద్ అమ్మ కొడుకయ్యాడు. ఇటీవలి

మెహిదీ పట్నంలో భూషన్ క్లినిక్ సంబంధీకులు ప్రస్తుతం కోటీశ్వర ప్రసాద్‌కు సంరక్షకులుగా వున్నారు.

## దాయాదుల గొడవ

ఎన్టీఆర్ సంతానానికి, లక్ష్మిపార్వతి కొడుకుకు మధ్య కోల్డ్ వార్ మొదలైంది. ముఖ్యమంత్రి అధికార నివాసంలో ఎన్టీఆర్‌ను కలుసు కోవటానికి ఎన్టీఆర్ కుటుంబ సభ్యులు ముందుగా అనుమతి తీసుకోవాల్సి వస్తోంది. అయితే అమ్మ కొడుకు కోటి

తరవ 10 పేజీలో



Edited, Printed and Published by Nellore Dolendra Prasad at Zaminryot Press, Offset Printing at Nayagara Paper Products (I) Ltd